# రామవిలాసము

(నాల్గవముద్రణము)



గ్రంథకర్త:

## ఏనుగు లక్ష్మణకవి.

ప్రకాశకులు

## శ్రీవత్సవాయి రాయజగపతివర్మ

రాజమండ్రి:

లక్ష్మీప్రింటింగువర్క్సునఁ

ముద్రింపఁబడియె.

**1934**



[వెల 0—12—0

# నాల్గవ ముద్రణ పీఠిక

ఈమహాకవి విరచితగ్రంథరాజమును నాల్గవసారి ముద్రించుటకు కారకులు నామిత్రులగు శ్రీరావుబహాదరు గొట్టుముక్కల జగన్నాథరాజుగారు. బి. యె. బి. యల్. యం. యల్. సి. అందులెజిస్లేటువు కవున్సిలు ఉపాధ్యక్షులు. వీరు విశాఖపట్నము జిల్లాబోర్డుకు ప్రెసిడెంటుగనుండి అనేకవిధముల నాకీగ్రంథ ప్రచురణ సందర్భములో తోడ్పడినందులకు వీరికి నే నెంతయు కృతజ్ఞుఁడనై యుండువాఁడను.

ఇప్పటికీ నాల్గవముద్రణము మూఁడవ ముద్రణము ననుసరించియే తొందరగచేయఁబడినది. భగవదనుగ్రహమున్నచో అయిదవముద్రణము కృత్యాదిగా గాక సంపూర్ణముగ ముద్రించి ఆంధ్రలోకమునకు సమర్పించుకొందును.

ఇట్లు,

13_8_34
పెద్దాపురం

వ. రా. జగపతివర్మ,
గ్రంథప్రకాశకుఁడు.

శ్రీరస్తు.

# రామవిలాసము.

## ప్రథమాశ్వాసము.

శ్రీరాధాకుచమండలీకలిత కాశ్మీరంబుచేఁ గౌస్తుభో
దారాత్మీయభుజాంతరస్థలికి శోభావాప్తి రెట్టించుశృం
గారోదారుడు కృష్ణదేవుడు త్రిలోకస్వామి రక్షించు ల
క్ష్మీనరసయ్యాత్మునివత్సవాయకులజున్ శ్రీగోపధాత్రీశ్వరున్.

సీ. తరులతార్పితసుమాస్తరణసంఛన్నబృం
దావనాంతర భూమిపావనములు
కాళీయఫణరత్న కాంతిరంజితనాట్య
శింజాన మంజీర మంజులములు
అరుణశారద సూర్యకిరణబోధితసార
సోదరసోదరద్యుతి పదములు
కమనీయ రాధికాకరసవ్యపల్లవ
లలితసంవాహనలాలితములు

మౌనిమానససుందర మందిరములు
పంకజాంకుశకులిశ రేఖాంకితములు
కృష్ణదేవుని మృదుపాదకిసలయములు
శాశ్వతైశ్వర్యములు కృతిస్వామికొసగు.

చ. మగనియురంబు మందిరము మన్మథకాంచనగర్భులాత్మజు
ల్నిగమములెల్లఁ బాఠకులు నిర్జరకాంతలు దాసికాతతు
ల్దగుచెలి శైలరాజసుత తండ్రి సుధార్ణవుఁ డేపురంధ్రిక
జగములతల్లి గోపనృపుసద్మమున న్వసియించు గావుతన్.

చ. కనకనగంబు వాసుకియుఁ గంజదళాక్షుఁడు చాపమున్గుణం
బును విశిఖంబుగా ద్రిపురముల్ఘనదోర్బలయుక్తి మి[illegible]
ల్చిననెరజోదు వైభవవిశేషజయాభ్యుదయాదినిత్యశో
భనములొసంగు గోపనరపాలకమౌళికిఁ బుణ్యశాలికిన్.

ఉ. అంబికచేత నంబుజభవాదిపర్వకదంబ పూజ్యపా
దాంబుజచేత నైందవకళాంకితసుందరమౌళిచేతఁ బు
ష్పాంబకజీవనప్రదమహౌషధిచే గిరికన్యచేతనీ
లాంబుదవేణిచేత విజయంబుఁ గృతీశుడు గాంచుగావుతన్

ఉ. భారతిచెక్కుటద్దములపై మకరీమయపత్రరేఖలిం
పారలిఖించు నత్తిరిజిరాయువు వ్రాయుము భక్తకోటికఁ
చారయవేడినం దనప్రియాభిమతంబున కాత్మమెచ్చున
వ్వారిజగర్భుఁడిచ్చు నిరవద్యచిరాయువు గోపశౌరికిన్.

ఉ. వాణికిమంజువాణికి సువారిజపుస్తకకీరవల్లకీ
పాణికి చక్రనీలరుచిభాసురవేణికి రాజహంసకున్
ఖాణికి వేదవేద్యపదకంజయుగప్రణతిప్రవీణ గీ
ర్వాణికి బద్మసంభవునిరాణికి భక్తినమస్కరించెదన్.

సీ. వాణీశ ముఖ్యగీర్వాణులెవ్వాని బూ
జించి కాంచిరభీష్ట సిద్ధిమున్న
గండస్రవద్దాన గంధసంపద నెవ్వ
డిందిందిరములకు విందుసేయు
మధురామృతస్రవామ్లానప్రసూనంబు
ఘనత నెవ్వఁడు మస్తకమున దాల్చు
దూర్వార్పణమున బొందుగ మెచ్చి సురగవి
గతి కామితార్థములిచ్చుతుకు నెవ్వ
డతఁడు జగజెట్టి ముక్కంటి యనుఁగుపట్టి
దాసులకు గల్పతరువు విద్యలకు గురువు
సుగుణమణి భూమి యేనుగుమొగముసామి
మముఁ గృతార్థులఁ గావించి మనుచుఁ గాత.

ఉ. సంకుచితారవిందపుట సంగతలక్ష్మిని దోఁచి తెచ్చి ని
శ్శంకకళాహర సజ్జనవిశాలగృహంబుల నిల్పుబుద్ధిచేఁ
బంకజకోశముల్ కిరణపఙ్క్తులచే వికసింపఁజేయు న
ప్పంకజమిత్రు వేదనుతిపాత్రుఁ బవిత్రచరిత్రుఁ గొల్చెదన్.

క. శాంతున్ సురతరుమూల ని
శాంతున్ గపియూథ వనవసంతున్ సజయ
స్వాంతున్ బలవంతున్ మతి
మంతు హనూమంతు నెంతుమదిని భజింతున్.

క. ఆదిమకవి నెంతు శుభా
పాదిమధుక్షీరమధుర ఫణితిని నమృతా

స్వాద్విమనస్కుని దురిత
చ్ఛేదిమహాకావ్యకరుని శ్రీవాల్మీకిన్.

క. ఘోరతమోహారి మహా
భారతకృతిభాస్వదుదయపర్వతమాలిన్
సారతపోనిధి దలతును
సారతతిశ్యామకాయు సాత్యవతేయున్.

ఉ. సారసగర్భ సన్నిభుల సత్కవులన్నినుతింతు భారతీ
పూరుషమూర్తులన్ భువనపూరిత గీర్తులఁ గాళిదాసునిన్
భారవిహీరుజోరు శివభద్రుని బాణు మయూరుమాఘుని
న్నేరువహించునున్నతుల బిల్హణమల్హణశంకరాదులన్.

ఉ. ఇవ్వసుధన్ విచిత్రగతినేర్పడి రాంధ్రకవిత్వసృష్టికిన్
మువ్వురు బ్రహ్మలంచు బుధముఖ్యులనందగు వారిగొల్చెదన్
నివ్వటిలంగ నన్నయ మనీషివతంసుని నెఱ్ఱప్రగ్గడన్
జవ్వపుకీర్తులంబరగు మాన్యుని దిక్కనసోమయాజినిన్.

సీ. వర్ణింతు వేములవాడ భీమకవీంద్రుఁ
బ్రణుతింతు శ్రీనాథభట్టవరాళి
భజియింతు శ్రీరామభద్రుని బింగళి
సూరనామాత్యుఁ బ్రస్తుతియొనర్తు
సోమునిఁ దలఁతు భాసురభక్తి వెలయభా
స్కరునకునంజలి సంఘటింతుఁ
బ[illegible]మాఱునెంతు బిల్లలమఱ్ఱి వీరేశు
ముక్కుతిమ్మయకు గేల్మోడ్పులిడుదు

దిట్టకవివిశ్వనాథు బ్రార్థించికొల్తు
నతని నందనుడగు వెంకటాద్రికవికి
వాక్యపూజలుగావింతు వక్కలంక
వీరభద్రుని గావింతు గౌరవమున.

సీ. ఫణికులాధీశభాషిత భవ్యభాష్య
ఫక్కిగా భావనిర్ణయ ప్రౌఢమతిని
ధన్యునాకరపల్లి కోదండరాము
సద్గురుస్వామి నతిశాంతు మదిభజింతు.

ఉ. శ్రీతనుజాతసుందరు నశేషమునీషిమనీషితార్థసం
ధాతను శ్రీనికేతను విధాతనుబోలిన మేటిసూరిసం
ఘాతనుతప్రబంధచయకర్తను గీతరహస్యవేదమా
తాతనులక్ష్మణార్యుని ముదంబున నెంతు విభాత్రయాతనున్.

గీ. పార్థివేశ్వర పూజాకృతార్థుసకల
పార్థివస్థానపూజితు భాగ్యవంతు
సరసకవితాప్రవీణు మజ్జనకుదలతు
దివ్యభారతియొనుగ తిమ్మకవిని.

చ. ఎలమిఘటించుమూర్ఖులకు నెచ్చటనైన నిరీక్షచేసినన్
నెలకొనసర్థగౌరవము నింపగ జాలదు మేలుసేయలే
దిలగుకవిప్రణీత కృతి కృత్రిమ రత్నమురీతి నేతఱిన్
వెలవెలబోవుదానికి వివేకధురీణులు సమ్మతింతురే.

గీ. ఈప్రకారంబుచేత నభీష్టదేవ
తాభివాదనవిధియు మహాకవీంద్ర

సంస్తుతియు గురుపాదాంబుజాతవంద
నమునుమఱియును సుకవినిందయును జేసి.

వ. ప్రాచేతసమహాకవిప్రణీతరామాయణ రమ్యకథానుసారి యు సకలకలుషాపహారియు, రుచిరభావరసాలంకార వికాసంబును నగు రామవిలాసంబను ప్రబంధంబు నిర్మింప నుద్యోగించి యీసరసకృతికి నుత్తమనాయకుం డేసుకృతిలభించునో యని వితర్కించు సమయంబున.

సీ. ఏరాజహస్తాబ్జ మిందిరాసుందరీ
ప్రాణభర్తకుఁ గేళిభవనమయ్యె
నేవదాన్యునిదాన మిసఁపుత్త్రశిబిమేఘ
కల్పభూజాదులగణనమాన్పె
నేధీరుసితకీర్తి యిందుచందనకుంద
మందారతారలగ్రిందుజేయు
నేధన్యుసౌందర్య మిక్షుకోదండునై
మఘవనంతాదుల సౌరుగేరు
నతఁడు రాజాధిరాజసభాంతరాళ
సూరిమణివర్ణితాద్భుతసుగుణశాలి
వైరితిమిరాపహారి తీవ్రప్రతాప
హేళి శ్రీవత్సవయగోపనృపతిమౌళి.

వ. మఱియు నిందిరాసుందరీ ముకుంద చరణారవింద ధ్యానమకరంద నిష్యందరసకందళితానందసందోహ నిష్పంద

హృదయమిళిందుండును, మందహాసచంద్రికా సుందరవదనేం
దుండును సింధురశతానందసుందరీ కుంభచందన మందాకినీ
పురందరగజమందార బృందారకాహార నీహారహార హీరాతి
విశదయశస్తుందిల దిక్కుంజరుండును ధీరతావధీరిత మందరుండు
ను భండనోద్దండ చండరిపువిపులా మండలాధిప ప్రాణసమీర
ణోపహార సంప్రీణితనిజభుజాదండమండలాగ్రకుండలీశ్వరుండు
ను శాశ్వతైశ్వర్యమహైశ్వర్యుండును వితతవితరణవిభవవి
భ్రమవినిర్ధూత జీమూతసిత మహామహోదధి దధీచివిబుధ
నైచికీఖేచర ప్రముఖవిశ్రాణన ప్రావీణ్యుండును మానధనా
గ్రగణ్యుండును సురనదీతుల్య తుల్యభాగాతీర భాగాభరణ
వల్మీకగిరిక్షేత్ర రాజాధ్యక్ష లక్ష్మీనరసింహదేవ సేవామహో
త్సవారాధన సమాసాదితచ్ఛత్ర చామరసుఖాసనాది రాజ
లక్షణ సంపన్నుండును మహాకవిప్రసన్నుండును త్రిభువనరా
యరాహుత్తకంఠీరవుండును బరపక్షభైరవుండును గడుగుర్గరా
య చిహ్నాలంకారుండును స్వామిద్రోహర గండబిరుద మహో
దారుండును నవబిరుదరాజకుమార వేశ్యాభుజంగుండునుగురు
చరణారవింద ధ్యాన పరిశుద్ధాంతరంగుండును భేషిణీహనుమం
తుండను బిరుదరాజభయంకరలాంఛన శ్రీమంతుండునుబ్రత్య
బ్దకళ్యాణ ప్రతిదినకారిత షోడశోపచార పూజాసంతోషిత
ప్రసాదసదనవదన మదనగోపాల కరుణాకటాక్ష ప్రసారసంవర్ధ
మానపూజ్య సామ్రాజ్య లక్ష్మీవిలాస విశాలుండును బరమ

న్నెదుర్గవిభాలుండును శ్రీమద్వసిష్టగోత్రపవిత్రుండును సింహా
ద్రిరాజపుత్రుండును నిజాశ్రితజనకుముదసముదయ పూర్ణిమా
చంద్రుండునునగు శ్రీవత్సవాయ గోపరాజేంద్రుండు మహీసు
పర్వాశీర్వాద మహిమాభివర్ధిత మహావైభవంబు గాంచిసమా
నులలో నుత్తమశ్లోకుండై ప్రకాశించుచునొక్కనాఁడు.

శా. వేదాంతాది సమస్తశాస్త్రనిపుణుల్ విద్వజ్జనుల్ గావ్యవి
ద్యాదక్షుల్కవి శేఖరుల్ సచివులున్ దైవజ్ఞులున్సత్కథా
వేదుల్ రాజులుగాయకుల్ ప్రియసఖుల్ వీరుల్ హితుల్ వార
కాంతాదుల్గొల్వఁగఁగొల్వుకూటముననధ్యాసీనుడై వేడుకన్.

వ. ధర్మరహస్యవిశేషంబు లాకర్ణించుచున్నయెడ మనీ
షిముఖ్యులిట్లనిరి.

గీ. ధార్మికులలోనఁ గృతిపతి ధన్యుఁడతని
కీర్తిగంగ తెలుంగున క్రీడసేయు
ముజ్జగంబుల తరుసరో ముఖ్యవివిధ
సంతతులకంటెఁ గృతిమహాశాశ్వతంబు.

క. గండితెగి చెరువుపాడగు
ఖండింపనశించు వనము ఘనవృష్టిమరు
త్తాండవముల గుడిగూలు న
ఖండితమై కావ్యమమరుఁ గలకాలంబున్.

వ. మఱియు సకలకలుష నివారణంబును, శుభవిభవ
కారణంబునునగు కృతిరూపసంతానంబునంబోలె సర్వాభీష్ట

ఫలావాప్తినిదానంబగు నది భవద్వంశపుణ్యవంతులకు సుల
భంబగు ననియిట్లుబోధాంబుధులైన బుధులుపదేశించినవిని
తథావిధి భవ్యకావ్యాధిపత్యసంపాదన కుతూహలాధీనమాన
సంబున.

సీ. సురుచిరాపస్తంబసూత్రువాధూలస
గోత్రుసద్విన యాదిగుణసమేతు
నేనుగలచ్చకవీంద్రుని పౌత్రుని
శ్రీమాచిరాజు నృసింహమంత్రి
దౌహిత్రుభూవరాస్థానపూజ్యుని దిమ్మ
మంత్రికి జేరమాంబకు సుపుత్రు
ధన్యుననంతాభిధానసోదరు వీర
భద్రునకగ్రజు భాగ్యవంతు
లలితకవితాకళాధుర్యు లక్ష్మణార్యు
నన్ను బిలుపించి యుచితాసనమునునుంచి
చాలకరుణించి తనముఖాబ్జమున మంద
హాసమమరంగ నిట్లని యానతిచ్చె.

సీ. సృజియించినాడవు సేతురామేశ్వర
మహిమంబు పాండిత్య మహిమమెఱయ
గల్పించినాడవు ఘనులెన్న జాహ్నవీ
మాహాత్మ్య కృతిసుధామధురఫణితి
నిర్మించినాడవు నిర్జరభాషచే
శతకంబుభాస్కర స్వామికెలమి

రచియించినాడవు రుచిరంబుగా సుభా
షితరత్నమాలిక శివుని పేర
రమ్యవిశ్వేశ్వరోదాహరణనృసింహ
దండకాదిస్తుతి బ్రబంధములఁగూర్చి
సములలో నుత్తమఖ్యాతి నమరినావు
లలితగుణధుర్య యేసుగ లక్ష్మణార్య.

గీ. వారిజాసన వారీముఖారవింద
సారసౌరభఘునఘునసారసాంద్ర
పీటికాబంధుర సుగంధ విభవమధుర
లలితవాగ్ధుర్య యేసుగ లక్ష్మణార్య.

గీ. ధీరులునుతింపనిప్పుడు మీరుసేయు
భాసురంబగు రామవిలాసకావ్య
మంకితముసేయు మాపేరననఘుశీల
ధరణిసాచంద్రతారక స్థిరముగాఁగ.

క. అని యానతిచ్చి వాహన
కనకాంబర రత్నఖచిత కంకణహారా
ద్యనుపమ భూషణచందన
ఘనసార వ్రిచురపీటికలు దయనొసంగెఁ.

వ. ఇట్లు సత్కారంబుఁజేసినం జేకొని సంతసిల్లియంత
రంగంబున—

క. దేవాంశభవుఁడు గోపమ
హీవల్లభుఁ డస్మదీయకృతికన్యకు సు
శ్రీవర్ధిల బతియగునటి
భావించిన నింతకన్న భాగ్యముఁగఁ దే.

క. భాసురమగు కనకమునకు
వాసనవలె గోపరాజవర్యుఁడు రసికా
గ్రేసరుఁ డధినాయకుఁడై
భాసిల్లె మదీయకృతికిఁ బ్రాజ్ఞులు మెచ్చన్.

వ. అని కందళితానందహృదయుండనై భోజనందనానందనపదారవిందవందన కృతార్థశీలుండగు శ్రీవత్సవాయగోపాలునకు నిరంతరాభ్యుదయాభివృద్ధికరంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద.

సీ. శ్రీవిష్ణునాభిరాజీవమధ్యంబున
బ్రభవించె విశ్వనిర్మాతధాత
యంభోజభవునకు సంభవించె మరీచి
యతనికిఁ గశ్యపుఁ డవతరించెఁ
గశ్యపబ్రహ్మకుఁ గలిగె బ్రహ్మాండదీ
వకుఁడు త్రయీమూర్తి భాస్కరుండు
వనజమిత్రునకు వైవస్వతుండుదయించె
ఘనుఁడు వైవస్వత మనువుఁ గాంచె
దతఁడు నిక్ష్వాకునృపుని దద్వంశమునను
దగఁ గకుత్స్థుండు రఘువును దశరథుండు

జనన్నమొందిరి యాదశస్యందనునకు
రాముఁడుజనించె దిృభువనరక్షకుండు.

వ. ఏతాదృశ మహాపురుషభూషితంబైన సూర్యాన్వయంబుసాగివంశ మనంగ్రగణ్యంబుగం బ్రసిద్ధంబయ్యె. అందుసంభవించి.

గీ. సహ్యజాతీరమునకు భూషణమనంగ
సిరులకిరవగు గుడిమెట్ట పురముదనకు
రాజధానిగ సత్కళాభోజరాజు
సాగిపోత క్షమాభర్త జగతియేలె.

క. ఆసాగి పోతనృపతికి
భూసురరక్షకుడు మదరిపుత్రాసదబా
హాసత్వుడు నరసింహాఖ్యుడు
భాస్కరతేజుడు జనించి ప్రజలనోృచెన్.

ఉ. ఆనరసింహ భూపతికహార్సతి యామవతీశతుల్యతే
జోనిధులశ్వినీతనయ సుందరులిద్దగు గగ్గిరాత్మజుల్
భూసురకీర్తియా మనుమపోత మహీతలనాథ చంద్రుఁడున్
మానధనాగ్రగణ్యుఁడగుమాచనృపాలుఁడు వంశవర్ధనుల్.

మ. స్థిరభక్తిన్గుడిమెట్టలోపల బ్రతిష్ఠించెన్నృపాసింధుబంధురసౌధంబునవిశ్వనాథుబరమాత్మున్ రాజనారాయణున్
సురవంద్యున్ బెజవాడయందునిలిపెన్ సుశ్లోకధర్మైకతత్పరశీలుండగుమన్మపోతనృపుఁడే తన్మాత్రుఁడేయెన్నఁగన్

క. మాచనృపాలుఁడు సకలధ
రాచక్రభరంబు బూని రాజులరాజై
శ్రీచిత్తేశుని కృపచే
నాచంద్రస్థిరయశస్కుఁడై నుతికెక్కెన్.

క. బంగారు పాదుకలుదొడు
గంగా నెడలేదు మాచ ఘనుపాదంబుల్
సంగర రంగజితాహిత
పుంగవశీర్షముల నెల్లపుడు రాజిల్లున్.

క. ఆమాచనృపతిసుతుఁడు మ
హామహుఁ డెఱపోతనక్షమాధీశ్వరుఁడా
శ్రీమంతుసుతులు జగదభి
రాములు శ్రీతెలుగురాయ రామనరేంద్రుల్.

సీ. ఆరామ రాజేంద్రు డాజిరంగంబున
వైరిరాజులగెల్చి వారిచేత
మదగజకంఖాణ మాణిక్యగాణిక్య
కనకాంబరము లుపాయనములందె
యాచకశ్రేణుల కభిమతార్థములిచ్చె
బ్రజలసంరక్షించె భరతునట్లు
తగవత్సవాయాఖ్య నగరంబునిజనివా
నముజేసె నదికారణముగ సాగి

గీ. పరమకల్యాణి నాగభూపాలురాణి
యమితగుణముల కుప్పమాదప్పగనియె
ధీరరత్నారంగవీరుని దిప్పనృపుని
నతఁడు ధర్మక్రమంబున నవనియేలె.

క. అమ్మానవేంద్రమానిని
యప్పప్పకు సింగభూవరాగ్రణిపుట్టెను
నెమ్మిని రెండవ పతియగు
ముమ్మప్పకు జగ్గరాజముఖ్యుఁడు గలిగెన్.

వ. ఇందుఁ గృతిపతివర్ణనానుగుణముగా మున్ను సింగమనుజేంద్రునకు బ్రియానుజుండైన జగ్గరాజుసంతతి క్రమంబు వర్ణించెద.

గీ. వత్సవాయతిప్ప వసుమతీశక్షీర
జలధిచంద్రుడైన జగ్గనృపతి
యెల్లమాంబయందు నింద్రాదిదిక్పాల
సములసుతులగాంచె సాధుహితుల.

సీ. హరిదశ్వనిభతేజుడైన రాయపరాజు
గుణరత్ననిధి పెదకొండనృపతి
గురుపూజకుడు పుట్టకొండభూపాలుండు
శ్రీరామతుల్యుడు వీరశౌరి
విజయోన్నతుడు పెదవెంకటక్షితిభర్త
విద్యాప్రియుఁడు చినవెంకటాద్రి

ఐశ్వర్యశాలి పెద్దప్పలనృపమౌళి
యతిదయాంభోధి చినప్పలన్న
భవ్యవిశ్వంభరాభారభరణనిపుణు
ఘనభుజాబల విజితదిగ్దంతులధిక
నిర్మలస్వాంతు లత్యంత నీతిమంతు
లగుచువిఖ్యాతిగాంచిరి జగతియందు.

ఉత్సాహావృత్తము. గుణనిధానమైన పుట్లకొండ శౌరికిన్వధూ
మణికిగోపమాంబకున్గుమారుడై జనించె వా
రణసమానబలుడు బాపిరాజు దానకర్ణుడున్
రణకిరీటియంచు బుధులురాజులెంతురాతనిన్.

గీ. బాపిరాజుకుమారులు భాగ్యనిధులు
పలికిబొంకనిధన్యులు బంధుహితులు
సువప్రసాదముఖుండు జగ్గప్రభుండు
భక్తసులభుండు హనుమన్నృపాలకుండు.

క. హనుమద్భూజానికినం
దనులై బాపన్నజగ్గ నరనాథుడురా
మనృపాలక వెంకటపతు
లనువారలు హాళిభుజంబులనదగిరి ధరన్.

వ. అందు.

గీ. బాపిరాజేంద్రసుతులు సౌభాగ్యయుతులు
ఘనులుసింహాద్రినృపుడు జగ్గప్రభుడును

నందుసింహాద్రిరాజు విఖ్యాతిఁగాంచె
శత్రుగజసింహమితఁడని జనులువొగడ.

చ. మనునిభుఁడైన బావనృపమాళికి రెండవనందనుండు శ్రీ
తనయసమానమూర్తి సతతద్విజభక్తిపరాయణుండు స
ద్వినయవివేకభూషణుఁడు ధీరుఁడు బంధుజనప్రియుండు కాం
చనగిరితుల్యతేజుఁడగు జగ్గనృపాలుఁడు పూజ్యుఁడుర్వరన్.

గీ. బావశౌరికిదమ్ముఁడై ప్రబలినట్టి
జగ్గరాజుబలంబున దిగ్గజంబు
కవిజనంబుల పాలింటి కల్పతరువు
పుత్రవంతుండు నుతికెక్కె జగతియందు.

గీ. అతనిపుత్రులు వెంకన్న యధికబలుఁడు
శ్రీహనూమంతుఁ డరికరిసింహరాజు
భానుతేఁజుఁడు రాజన్న మానఘనుఁడు
పద్మరాజన్నృసింహుఁడు భాగ్యశాలి.

గీ. భాగ్యనిధియగు వెంకటపతికిసుతులు
లక్ష్మనరసన్న పెదమాళ్ళు లలితమూర్తి
జగ్గరాజు నారాయణ జనపతియును
వార్తకెక్కిరి సకల భూవరులసభల.

గీ. అందు జగ్గనృపాల పురందరునకు
నందనులు సంభవించి రానందఘనులు
వెంకటపతిక్షితీశుఁడు విప్రహితుఁడు
కృష్ణభక్తుఁడు వేంకటకృష్ణరాజు.

క. నారాయణ దేవునికృప
నారాయణభూవరునకు నారాయణసే
వారూఢుఁడైన పుత్త్రుఁడు
ధీరుఁడువెంకన్న ప్రబలెఁ దేజోనిధియై.

క. హనుమన్నృప మౌళికి నం
దనుఁడగు వేంకటనరేంద్రు తనయులు నమరా
ర్జునుఁడనఁదగు రాజన్నయు
హనుమంతుఁడు జగ్గరాజు నతిపుణ్యాత్ముల్.

వ. అందు.

క. హనుమంతయ్యకు ముగ్గురు
తనయులుప్రభవించి రధికధైర్యులు తేజో
దినమణివెంకన్నయు శో
భనచరితులు రామచంద్ర బలభద్రనృపుల్.

వ. ఇవ్విధంబునఁ బుట్టకొండ మహీమండలాఖండలుని వంశంబు విస్తరిల్లుచుండె, నిటమీఁద శ్రీపేరభూపాలచంద్రుని సంతతి క్రమంబు వర్ణించెద.

ఉ. మేరుసమానధీరుఁడన మేఘునితోఁ బ్రతివచ్చు దాతనా
సారసమిత్త్ర తేజుఁడనఁ జంద్రజయంత వసంతసుందరా
కారుఁడనంగ వాసవుని కైవడి భోగియనంగనన్నిట
న్మీరువహించె వత్సవయ పేరనృపాలుడు రాజమాత్రుఁడే.

శా. ఆపేరప్రభు సార్వభౌమునకు నారాంబామహాదేవికిన్
శ్రీపెద్దిక్షితినాథుడప్పలధరిత్రీభర్తయుఙ్ గోనప్ప

ద్వీపాలుండును రాజభూమిపతియున్దిమ్మక్షమాజాని ప్రి
జ్ఞాపూర్ణుండగుజగ్గరాజమణియున్ జనిస్త్రించి రాత్రోన్మద్భవుల్

గీ. పెద్దలగువారిమన్నించుఁ బెద్దిరాజు
దాతలకుదాత యప్పలధరణివిభుఁడు
మానధనమునఁ గురురాజు కోనరాజు
గుణపయోనిధి రాయపక్షోణిభర్త.

గీ. వారితమ్ముఁడు గాంభీర్యవారిరాశి
తిమ్మరాజశిఖామణి తేజరిల్లె
నతనికీర్తి నటించు శీతాద్రిసేతు
మధ్యపృథ్వీశ్వరాస్థాన మంటపముల.

సీ. అభ్యాగతులకు మృష్టాన్న సత్రములిడు
బీదల గనుగొని బ్రోదిసేయు
నభయంబొసఁగు శరణాగతజనులకు
బ్రాహ్మణపక్షంబు పదిలపఱచు
వినయవివేకము ల్దనసొమ్ముగా నెంచు
సుతులపోలిక నిజాశ్రితులఁబ్రోచుఁ
గొండెముల్జెప్పిన కూళలశిక్షించు
మనవిచెలించుఁ గాదనక నెపుడు

గీ. సత్యమేపల్కు ధర్మమేసంగ్రహించు
ననుచుబుధులు నుతింప విఖ్యాతిఁగాంచె
వత్సవయపేరధారుణీశ్వరునిసుతుఁడు,
రమ్యగుణశాలి శ్రీతిమ్మరాజమౌళి.

సీ. రణమున గుఱ్ఱింపు కాతులఁబరిమార్చి
వాసిగా నెరజర్ల వాకలోనఁ
బెద్దాపురంబున బిరుదాంకపురిలోన
యవనవీరులఁ బరాహతులఁ జేసి
బ్రతిఘటించు నరేంద్రసుతుని సర్పముడంచెఁ
దిరుపతి చెంత భూవరుల మెచ్చఁ
దూరుపునాట శత్రుక్షత్రియక్షత్ర
రుచిమాపుమాపె సూర్యాంశనంగ
గీ. వంగవంగకళింగ చోళాదిదేశ
వసుమతీనాథ సభలలో వార్తకెక్క
వత్సవయ్యపేరధారుణీశ్వరుని సుతుఁడు
రమ్యగుణశాలి శ్రీతిమ్మరాజమౌళి.
సీ. బిరుదాంకపురిని సుస్థిరముగా నిర్మించెఁ
బాలమున్నీటివి బోలుచెరువు
తిరుపతివాల్మీక గిరినూలవల్లిని
ఫలవృక్షవనములు నిలిపినాల
నృహరిగేహ తటాకనిక్షేపవనములు
కొమరుగాఁ బెద్దాపురమున నునిచె
విశ్వనాథకవీంద్ర విరచిత శేష ధ
ర్మపరిబంధము సాదరముగ నందె
విప్రవంశప్రతిష్ఠలు వెలయఁజేసె
బుత్రులనుగాంచె నీతినిపుణమయోళి

వత్సవాయాన్వయమునకు వన్నె దెచ్చె
నొచ్చెఁ జేరయతిమ్మధాత్రీశ్వరుండు.

ఉ. పేరుమహామ్మదుక్షితివశేఖరుఁ డద్భుతశౌర్యధైర్య దు
ర్వారుఁడు మెచ్చి పైఁడిరియొరవాల్ దన కేలనొసంగు వేళ పై
త్యారిసమానమూర్తి తనహస్తముమీఁదుగ నందె వార్ధిగం
భీరుఁడు వత్సవాయ కులపేరయ తిమ్మనృపాలుడున్నతిన్.

క. ఆతిమ్మ శౌరితమ్ముడు
చేతోజనమానమూర్తి చినజగ్గధరి
త్రీతలపతి మానవతీ
చేతోధనహారియైన చెలువునఁదనరెన్.

చ. పలుకులయందు వాణిముఖపద్మమునందు ముకుందురాణి శ్రీ
తనహృదయాంబుజంబున సుదర్శనపాణి బలోజ్వలద్భుజా
గ్గళమున దుర్మదారిభయకారి కృపాణి వహించె ధన్యునిన్
సలలితమూర్తి వత్సవయజగ్గనృపాలు నుతింపశక్యమే.

వత్సవయపేరధారుణీశ్వరుని పుత్రుఁ
డైన శ్రీతిమ్మనృపతికి దానినిధికి
రాయపవ్రభుగోపాలరాజు రాము
చంద్రులన సుతులుదయించి రింద్రసములు.

వ. అందు.

గండరగండలాంఛనుఁ డఖండితభండనచండవిక్రమా
ఖండలనందనుండు శశిఖండకిరీటి సుధాంశుమండలీ

కుంజరిరాజరాజ గజఘోటక పాండురకీర్తి పూరితా
జాండుఁడు రాయపక్షితివరాగ్రణి కేవలరాజమాత్రుఁడే-

సీ. తనప్రతాపము వైరితారకాగ్రహసమూ
హమునకు సూర్యోదయంబుగాఁగఁ
దనకృపారసము బాంధవజనకైరవ
సంతతులకుఁ జంద్రకాంతిగాఁగఁ
దనబిరుదంబు లుద్ధతశత్రుమత్తేభ
తతులకు సింహనాదములు గాఁగఁ
దనపాదనఖరేఖ వినమదుర్వీశ మూ
ర్ధములకుఁ బువ్వులదండగాఁగ

గీ. నలరుజగదేకవీర రాజాధిరాజ
రాయవేశ్యాభుజంగాది రమ్యబిరుద
శాలిశ్రీతిమ్మభూపాల మౌళిసుతుఁడు
వత్సవాయరాయపతుమహావల్లభుండు.

మ. ఘనశౌర్యంబునదుర్మదాంధనృపులన్ ఖండించిసత్కీర్తిచే
... ... ... ... ...
పెనయన్స్వీతపురంబు ధర్మపరుడై యేలెన్సమస్తార్థులన్
మనిచెన్దిమ్మనృపాలురాయపమహీనాథుండు భాగ్యోన్నతిన్

సీ. శ్రీరామునకుఁ గట్టుమూరునఁ గట్టించె
గుళ్ళుమంటపములు గోపురములు
గంభీరజలతటాకంబు ద్రవ్వించెగృ
హస్థపురంబున సుస్థిరముగఁ

బోలుపుగా వాల్మీకి పురిగాండ్రకోటను
ఫలభూజవాటిక ల్పదిలపరచెఁ
బ్రస్తవ్యమగు హరిభక్తి సుధోదయం
బను మహాకృతిరత్న మందుకొనియె
బేరుగలుగు మహాత్ముఁడు బేసనదియు
మెచ్చదగిన ఫమామీలు దెచ్చుకొనియె
బగతులగువారి గుండియల్దిగులుకొనఁగఁ
దిమ్మనృపురాయప క్షమాధీశ్వరుండు.

చ. ప్రతిభఁదనర్చు వత్సవయ రాయమహీశ్వరు చేతి హేతి దే
వతమహిమంబు చిత్రమనవచ్చుఁదనున్ హృదయాంతరంబునన్
ధృతినిమిషంబునిల్పుకొను ధీరవిరోధుల వాజిమేధస
త్క్రతుశతసాధ్యమైనసురరాజపదంబుననిల్పఁగన్గనన్.

సీ. దర్పాంధయవన మస్తకముల బురుజులు
గట్టించెనమ్మయ్య గట్టుచెంత
లోంపకలోవలో గుంపులుగొనిపోర
వచ్చినదొరల గర్వంబడంచె
జెలగిపోత్రాజును జేపట్టి రాఘవ
రాజు దేశమునకు రాజుఁజేసె
శరభరాజును గుహాంతర వాసుఁగావించి
యతనిగూడెంబు వీరన్నకిచ్చె
గడుసు మన్నీల భృత్యులుగానొనర్చె
నిగ్రహానుగ్రహంబులు నెగడజేసె

వత్సవయ తిమ్మధారుణీశ్వరునిసుతుఁడు
రాజమాత్రుఁడె రాయపరాజశౌరి.

మ. సులతాన్ శాహాబహద్దరబ్దులహసన్ క్షోణీంద్రుచేఁ బూజ్య
పింగళమాదన్నబుధేంద్రుచేతబహుసత్కారంబులందెన్ నబా
బులుసాధింపఁగలేని దుర్గనికరంబుల్ లీలచేగెల్చి ది
క్కులకీర్తుల్వెలయించెరాయపమహాక్షోణీశ్వరుండున్నతిన్.

సీ. ఘోటకవాహినీ ఝాటకర్కశ పార
సీకసైనిక శిరశ్ఛేదకుండు
రణరంగ విజయేందిరాకరగ్రహణము
గళయోగ్య పటహశంఖస్వనుండు
చంచలలోచనాజన మనోధనహారి
సౌందర్యజితపంచ సాయకుండు
ఫాలాక్షరాఘవ భార్గవపార్థాది
కార్ముకవిద్యా ప్రగల్భసముడు
ద్రవిణసామర్థ్య విఖ్యాతిరాజరాజు
భోగసురరాజు సత్కళాభోజరాజు
సరసతిమ్మప్రభు క్షీరజలధిరాజు
భళిరె శ్రీవత్సవాయ గోపాలరాజు.

క. అమ్మానవేంద్ర మహాళికిఁ
దమ్ముండన రామచంద్ర ధరణీపతికిన్
గమ్మవిలుకానితండ్రికి
నిమ్మహిలోఁ దారతమ్య మెన్నందగునే.

ఉ. ధర్మముఁ బూనఁడో గురుబుధద్విరక్షణ మాచరింపడో
దుర్మదచిత్తవృత్తులగు దుష్టవిరోధుల నిగ్రహింపడో
నిర్మలకీర్తి లోకములనించఁడొ సర్వగుణాభిరామునం
దర్మిఖురామచంద్ర నరనాథుని రాముడనంగఁ జెల్లదే.

గీ. వత్సవయ తిమ్మనసుమతీ వల్లభునకుఁ
దనయుఁడైనట్టి రాయపధరణిపతికి
రాణియైవిష్ణునకు రమారమణికరణి
శుభగుణకదంబ రాణించె సూరమాంబ.

క. ఆరాయప నృపవరాళికి
సూరాంబకుఁ బుత్రులధిక శూరులుతిమ్మ
క్ష్మారమణుఁడు బలభద్ర మ
హారాజునుగల్గి రచ్యుతాంశయువలనన్.

వ. అందగ్రజుండు:

సీ. అభ్రమాతంగాది హరిదంతదంతులు
ఘనుకాతతితోడఁ దిరుగుఁదోడఁగఁ
గులపర్వతంబు లగ్గలమైనబడలిక
నడలంగమిగుల విశ్రాంతిఁబొందెఁ
బాతాళలోకాధిపతియైన శేషాహి
సతికంఠ కంఠహారతభజించె
వృద్ధకచ్ఛపరాజు వీఁపునొప్పికిబాసి
జ్ఞాతిదర్శనకాంక్ష జలధి కేగె

నలహరిశ్చంద్ర నాభాగనహుషభరత
రంతిదుష్యంత పృథుభగీరథులమాడ్కి
ధన్యుఁడగు వత్సవయ తిమ్మధరణివిభుఁడు
భూమిభారంబు నిజభుజంబున వహింప.

చ. కరులతిమందబుద్ధు లురగప్రభుఁడు న్గుటిలప్రచారుఁడా
గిరులు మృదుత్వహీనములు కేవలతీవ్రుఁడు ఘోణినాథుఁడీ
విరసుల పొందు చాలునని వేఁడుకఁ జేరె ధరాలతాంగి సు
స్థిరగుణశాలి వత్సవయతిమ్మనృపాలు విలాసమన్మథున్.

చ. విమతులు వత్సవాయకుల విశ్రుతతిమ్మనృపాలు మండలా
గ్రమునకు నాజిలో నెదురుగాఁ జని నిల్చినవారు సూర్యబిం
బము విదళించిపోవుటయుఁ బాయక తద్రవిఖండముల్ మహో
త్తమరుచిసంపదన్ మెరసె ద్వాదశభాస్కరులై జగంబునన్.

ఉ. రాజులలోన వత్సవయరాజులు ధన్యులు వారిలోపలన్
దేజముఁ గాంచెఁ బేరన్నృపతిమ్మమహీశ్వరుఁ డంతకన్న రా
రాజయి మించె రాయపధరావిభుఁడాయనకంటె వైభవ
భ్రాజితుఁడయ్యెఁ దిమ్మనృపరత్నము రాజకిరీటశోభియై.

మ. ధరణీనాథ మహోపహారబహువేదండాళిగండస్రవ
ద్వరసప్తచ్ఛదగుచ్ఛగంధిలసద్దానాంబుధారార్ద్రమై
సిరికిం బ్రాపయి వత్సవాయకులజ శ్రీతిమ్మరాజేంద్రభా
స్వరసంసద్భవనాంగణంబు దనరున్ సామంతసంసేవ్యమై.

ఉ. భోగముఁ దేజమున్ సుకృతమున్ బలమున్ గృపయున్ నవంబు వి
త్యాగము పూర్ణభావము మహావిభవంబును గల్గి రక్షణో

ద్యోగిదిగీశ్వరాంశముల నుద్భవమొంది ధరిత్రిఁ బ్రూనె నా
భాగువిరీతిఁ దిమ్మనరపాలశిరోమణి భాగ్యసంపదన్.

సీ. రాజులు మెచ్చఁ బరాకోట సాధించి
నరహరిదేవు దుర్నయమడంచె
గుదురైన బావిణి కోటలగ్గలువట్టి
యోముకోటంతయు నుర్విఁ గలిపె
దుగరాజు మొదలైన దొరలనుభంగించి
విశ్వంభరుని యుద్ధ విరతుఁ జేసెఁ
దగ బూసవాటి సీతారామభూపాలుఁ
డభిరతింపగ విజయంబుఁ గాంచె
సరిసముతుయవనాధీశు దురగవతినిఁ
గయ్యమున గెల్చె లోకవిఖ్యాతి జెందె
వత్సవాయాన్వయమునకు వన్నెదెచ్చె
రాయనృపాలు శ్రీతిమ్మరాజమౌళి.

చ. హరిహర పద్మజాంశభవుఁడై తగు నేనుగులక్ష్మణార్యుచే
నుచిరశబ్దభావరస గుంభ దలంకృతిమాధురీమనో
హరమగు ద్రౌపదీ పరిణయంబను నుత్తమకావ్యమందెను
స్థిరముగు కీర్తి పొంపెసఁగఁ దిమ్మనృపాలుఁడు ధర్మవర్ధతిన్.

మ. నిధినిక్షేపతటాక దేవగృహముల్ నిర్మించె నుద్యద్దయో
దధి యొదీనులఁ బ్రోచె షోడశమహాదానంబులుం జేసెనం
బుధిపర్యంతధరిత్రి యేలె బుధులన్ బోషించె సంపూర్ణ ధ
ర్మధనుండై నుతికెక్కె వత్సవయ తిమ్మక్ష్మాపతీంద్రుండిలన్.

క. క్షితిరాజన్యతిమై సు
స్థితిగాంచెను దిమ్మనృపతిచేతన్నె తారా
తతిమతియయ్యును జ్యోతి
ష్మతియగునే రాత్రిచంద్రసంగతిదక్కన్.

గీ. అమ్మహారాజు సోదరుండనఘమూర్తి
విక్రమస్ఫూర్తి రాణించె విశదకీర్తి
యింద్రునకుఁ దమ్ముఁడైనఁ యుపేంద్రునట్లు
రమ్యగుణశాలి బలభద్రరాజమౌళి.

గీ. ఆదివిష్ణువు శ్రీకృష్ణుఁడైన వేళ
నన్నయైనట్టి బలభద్రుఁడంతశౌరి
తిమ్మరాజేంద్రుడగు వేళదమ్ముఁడయ్యె
ననఁగ బలభద్రరాజు విఖ్యాతిగాంచె.

సీ. సాష్టవజితపుష్పచాపంబు రూపంబు
గవిమనోరథపూరి కరముకరము
చంద్రబింబ ప్రభాసదనంబు వదనంబు
సన్నుతవిష్ణు సత్కథా శ్రేణివాణి
శరణాగతత్రాణ సదయంబు హృదయంబు
గురునమస్కార తత్పరముశిరము
బహుబాంధవాగమాభరణంబు శరణంబు
సురనదినిర్మల స్ఫూర్తి కీర్తి
వత్సవాయరాయపత్కుమావల్లభునకు
నూరమాంబకు సుతుఁడైన సుందరునకు

గలితతేజఃప్రపూర్ణదిక్కందరునకు
రమ్యబలభద్రరాజపురందరునకు.

సీ. ధర్మతనూజుఁ డీధరణీపతికిజోడు
బవరంబులోఁబొంకు పలుకఁడేనిఁ
ఘనధనంజయుఁ డీమహారాజునకుసాటి
శూరసాణికి వెన్నుఁజూపఁడేని
హరిణాంకుఁడీ గుణాకరునకు జతవచ్చు
మేనగళంకంబుఁ బూనఁడేని
కందర్పుఁడీనృపాగ్రణికిఁ దుల్యుండగు
లలిననంగుఁడుగాకఁ జెలఁగనేని
సత్యశౌర్యయశోరూప సంపదలను
గడమరాజులుసములని నుడువఁదగునె
యనుచుబుధులెన్న వత్సవాయాన్వయమునఁ
బ్రభనువిలసిల్లె బలభద్రరాజశౌరి.

మ. అమితఖ్యాతిసమూలమైన కృతిఁ దానఁదెన్నిరాతార్జునీ
యము శ్రీగాములపేర బద్యశతకం బాయూఢినిర్మించెభో
జమహీజానిగతిన్ బ్రసిద్ధిఁగనియెన్ సాహిత్యపారజ్ఞుఁడై
రమణన్ శ్రీబలభద్రరాజు ప్రజలన్ రక్షించె ధర్మస్థితిన్.

మ. బలభద్రప్రభుమౌళికిన్ సిరులచేభాసిల్లు వెంకాంబకున్
బలశౌర్యార్జవ చండశాసనుడు శుంభద్వైరి రాజన్యమం
డలవేదండ ఘటామృగేంద్రము నిరూఢక్షేముఁడత్యంతని
శ్చలధైర్యుండుదయించెరాయపమహీశస్వామిభాగ్యోన్నతిన్.

సీ. కాంతాకటాక్ష వీక్షణావత్పదములకుఁ
దనవదనంబు పద్మంబుగాఁగ
సూరిదారిద్ర్యాంధకారంబునకుఁ దన
వితరణంబినకర ప్రతతిగాఁగ
దుష్టారిజలధర స్తోమంబునకు, దన
జయవిక్రమము ప్రభంజనముగాఁగ
విష్ణుదేవు పదారవిందంబులకుఁ దన
సరసచిత్తము రమ్యసరసిగాఁగ
రాజవిద్వత్సభా నాట్యరంగములకుఁ
గలితనిజకీర్త్తి ఘనరక్తిగాఁగఁ దనరె
వత్సవయబలభద్ర భూవరునిసుతుఁడు
ప్రణుతగుణశాలి రాయపరాజమౌళి.

సీ. శత్రుతేజోనలజ్వాల చల్లార్చుచో
ధారాళమైనట్టి భూరివారి
యనిగెల్చు సిరిచూపులను నల్లగలువల
నలరంగఁ జేయుచోఁ దళజనైరి
పరిపంథిభూవర ప్రాణమారుతము
ప్రాణసేయుచోఁ బడగధారి
చక్కనిమగల నచ్చరలకుఁ గూర్చుచోఁ
జాతుర్యమెఱిఁగిన సౌఖ్యకారి
ఖలమదవిదారి భీమసంగరవిహారి
రౌప్యాలమిటారి సాధుజనోపకారి

ప్రస్తుతి వహించె రాయపరాజశౌరి
కరమునవసించు రంగుబంగరుకటారి.

చ. శుకకలహంసబర్హిబలసూదనరత్నసవర్ణసింధుబా
హ్లికముఖదేశసంభవసమిద్ధహయంబుల నోలిదెచ్చి కా
నుకలిడి దేశనాథులు మనుప్రతిమాను నవార్యశౌర్యతా
రకరిపుతుల్యు వత్సవయరాయనృపాలుని గొల్తు రెప్పుడున్.

మ. సరసాత్మన్ నిరతాన్నదాన కలనాసంతోషితానందభూ
సురపాలిన్ శుభవాక్య వర్ధితగజస్తోమాస్వరాజ్యార్థ సు
స్థిరలక్ష్మి పరిపూర్ణరమ్యభవనున్ శ్రీవత్సవాయాన్వయా
భరణున్ రాయపరాజచంద్రు నిదగున్ బల్మారు వర్ణింపగన్

గీ. రూపునను కాదు విక్రమాటోపమునను
మాధవుని గెల్చి విఖ్యాతమహిమ గాంచె
బద్మనాయకవిజయంబు బదిలపఱచె
దేశమున రాయపక్ష్మాధీశ్వరుండు.

ఉ. కొండలు పిండిసేయుదురు ఘోరరణంబున జండవైరి వే
దండమదంబులింక బెడిదంబుగ సింహరవంబొనర్తురు
ద్దండమృగేంద్ర సంఘముల దర్పమణంతురనంతశౌర్యపా
ర్థుండగు రాయపప్రభుశిరోమణికిన్ హితులైన సైనికుల్.

సీ. శ్రీవత్సవయవంశ సింధురాకాసుధా
కరుడైన బలభద్ర ధరణీపతికి
సుతుడగు రాయపక్షోణీశభర్తకు గొట్టు
ముక్కలసత్కుల ముఖ్యుడయిన

భగవన్నృపాలునిపట్టి యామాంబగారికిఁబుట్టిరి ఘనులు సుతులు
భానుశశాంక వైశ్వానర తేజులు
పద్మజపద్మాక్షభర్గసములు
బాహుబలశాలి తిమ్మభూపాలమౌళి
భోగబలవైరి బలభద్రభూపశౌరి
సూరివర్ణితగుణతతి సూరనృపతి
ధర్మసంవర్ధనులు మహోదారఘనులు.

వ. అందు,

శా. ఉద్యద్భాను సమాన తేజుని మహోయుద్ధక్షమాపార్థునిన్
మాద్యద్దిగ్గజ సారశోభితుని శుంభద్ధైర్య హేమాచలున్
విద్యాభోజుని రాయపప్రభుసుతున్ విస్తారసత్కీర్తి వై
శద్యుల్ మెచ్చఁగవచ్చువత్సవయవంశశ్రేష్ఠుఁదిమ్మప్రభున్

సీ. నాల్గువక్త్రములుబూనని బ్రహ్మదేవుండు
బాహుయుగ్మముగల బలివిరోధి
ఫాలనేత్రుఁడుగాని భావభావారాతి
వేయికన్నులు లేని విబుధభర్త
యేకచక్రరథాంగ మెసఁగనిభానుండుఁ
మృగలాంఛనుఁడుగాని తొగలవిందు
పంచసంఖ్యాతీక బాణుఁడౌమీనాంకు
డౌర్వాప్తి జెందని యంబురాశి

బోధవిక్రమానుగ్రహాభోగధామ
దానసౌందర్య గంభీరతాగుణముల
వత్సవయ రాయపక్షితీశ్వరునిసుతుఁడు
పాలితబుధాళి తిమ్మభూపాలమౌళి.

ఉ. చందనసన్నిధిస్థిరులు సారభవంతము లైనరీతిఁ దా
రందఱు దాత లై మెలఁగిరందఱు సంగరరంగశూరు లై
రందరు భవ్యకావ్యవిదు లై నుతికెక్కిరి విక్రమాద్రిజా
నందనుఁ డైన తిమ్మనరనాథుని సన్నిధియున్న సజ్జనుల్.

ఉ. ధీరులునన్నుతింప బహుదేశలిపుల్ బహుదేశభాషలున్
సారకవిత్వసౌష్ఠవ గసజ్జతయున్ దనసూత్మ్నబుద్ధిచే
నేరిచెవిద్యలన్నిటికి నిత్యవిభూషణ మైన యీవిచే
భూరియశంబుగాంచెగుణపూజ్యుడు తిమ్మనృపాలుఁడిమ్మహిన్

క. ఆయనసోదరుఁడు నృపో
పాయన మత్తేభదానపరిమళసాంద్ర
గ్రీయుతభవనద్వారుఁడ
జేయుఁడు బలభద్రరాజశేఖరుడలరెన్.

సీ. హరిపదాంబుజ నిరంతరభక్తినీరాజు
నెంచి రుక్మాంగదు నెంచవలయు
సకలవిద్యాబోధ సామగ్రినీరాజు
నెంచిభోజనృపాలు నెంచవలయు
శాత్రవగర్వభంజన యుక్తినీరాజు
నెంచి యింద్రతనూజు నెంచవలయుఁ

జండశాసనగుణార్ణవమున నీరాజు
నెంచిసుగ్రీవుని నెంచవలయు
గలితగుణవంతులకు నగ్రగణ్యుఁడధిక
పుణ్యుఁడీనరనాథవరేణ్యుఁడనుచు
బుధులు మెత్తురు బలభద్ర భూపరేంద్రు
రాయపమహీశసాగర రాజచంద్రు.

ఉ. వైరిగజాంకుశంబు గుణవద్ద్విజసంతతికెల్లఁ గొంగుబం
గారము బంధుకోటికిసుఖంబుగ నబ్బినపెన్నిధానమం
భోరుహనాభభక్తికిని బుట్టినయిల్లు విలాససంపదన్
మారుడురాయపప్రభుకుమారుడునూరనృపాలుఁడెన్నఁగన్.

గీ. రాఘవాంబకు రాయపరాజమణికి
దనయుఁడైనట్టి శ్రీతిమ్మధరణిపతికిఁ
బుత్రుఁడుదయించె జగపతిభూపమౌళి
వాసుదేవాంశమున వంశవర్ధనుండు.

చ. వినఁగనలేనికుండలిని వీడ్కొనియించుకయున్ జలింపజా
లనిగిరులన్వసించిగతులన్బహుమాంద్యముబూనుదంతులన్
గొనకొనిరోసివృద్ధకిటి కూర్మలపై యమరాగమేదిమే
దినివరియించె శ్రీజగపతిక్షితినాథుకుమారుమన్మథున్.

ఉ. భూమిఫలించె బంధువులపాల్పగుకోరికితోడ భూసుర
స్తోమముసంతసిల్లె బలసూదనముఖ్యసువర్వకోటితో
క్షేమముజారెవైరి నృపగర్వముతోడ భళీరెసన్నుత
స్తేమభుజోన్నతిన్ జగపతిప్రభుచంద్రుఁడు రాజ్యమేలఁగన్.

## ప్రథమాశ్వాసము.

సీ. కన్నుల నుగ్రాంధకారంబువలెగమ్మి
  గట్టుపుట్టలుచెట్లు గాననీదు
కలుకుగుత్తఁపుఁగొత్త గడుసుసంకిలిజోడు
  హత్తినగతి హజ్జలాడనీదు
చెవులదాళం బమర్చినమాడ్కి బంధించి
  లేమల మొరగ్రాలాలింపనీదు
లలినాటియున్న గుండెలలోనిగాలమై
  యూర్పునపడలింప నోపనీదు
వత్సవయ జగపతిమహావసుమతీశ
విజయధాటీసమాటీక విజితముఖ్య
జాఫరలిఖానమానస స్తంభవప్రి
గల్భమూఢభయా వేశగాఢతమము.

సీ. యవనకాంతాముఖాబ్జాసక్త మధుసుద
  రాగాతపంబులుపహిఁదొలంగ
బిబ్బీలవలిగబ్బి గుబ్బగుబ్బలులపై
  గ్రిమ్ముకప్రిపుదుమారమ్ములణగ
బారసీక కృశోదరీరమ్యలోచన
  కువలయంబుల వానగురియఁజొచ్చె
మధుపాయిరిపువధూమధురకథాపిక
  స్వరసంతతులకావి శాంతియొదవె
గరుడగంధర్వకిన్నర ఖచరముఖ్య
విబుధసంస్తుత్యసాహసవిజయకలిత

నత్నవయుజగపతి మహావసుమతీశ
రణఘనాగమఘన విజృంభణమువలన.

చ. మొగమునగుల్కువీరరసమోహనకాంతియు ధైర్యలక్ష్మికి
మగుజగెట్టోమ్ముభూరిసముదారిహ్మాదాయుధభ్రుస్మహాభుజా
యుగములుజూచియెంతవలపోజయలక్ష్మివరించెనాజిలో
జగపతిథారుణీరమణశౌరినిపత్సవయాన్వయోనయున్.

చ. జగపతిరాజసింహకరసంభృతఖడ్గఘటోద్భవుండుసాం
వృగపరవాహినీశ్వరసముత్కటజీవనమొల్లఁగ్రోలిన
ద్భుగఘనరాజమండలవిరోధముచేసినజావదల్లివిం
ధ్యగిరివినామశేషమ ఁనట్టుగనుంచెజగత్ప్రతిష్ఠగన్.

సీ. సాకేతపురరత్న సౌధపార్శ్వస్థిత
సురభూజవాటికాంతరసుధాస
రోరాజతీరచింతారత్నగృహచంద్ర
కాంతశిలాతలకలితకువల
పర్యంకజానకీభామావినోదిని
శ్రీరాఘవునిమనోవారిజమున
భావించిపూజలుగావించిసేవించి
పులకితగాత్రుఁడై పూర్ణమోద
బాష్పబిందుస్థగితనేత్రపద్ముఁడగుచు
బ్రీత్యహముగాముమంత్రజపంబుసేయు
నోరరాఘవభక్తజనాగ్రగణ్యుఁ
డనఁగ జగపతిరాజువిఖ్యాతిఁగాంచె.

చ. పదములుఁ గీర్తనల్ రుచిరపద్యశతంబులు రాగమాలికల్
మృదుపదదండకంబులు సమిద్ధగతిన్ రచియించి కామిత
ప్రదునకు భద్రశైలరఘుభర్తకుఁ గానుకగా నొసంగెనా
త్రిదశులు మెచ్చగా జగపతిప్రభుచంద్రుఁడు భక్తిపెంపునన్.

గీ. పుణ్యవత్సవయాన్వయాంభోధిచంద్రుఁ
డైనజగపతినృపతి యర్ధాంగలక్ష్మి
యుభయకులకీర్తిసంధాయి శుభచరిత్ర
యలరు సీతమ్మ శిరులచేఁ గలిమికొమ్మ.

సీ. దమయంతి కైవడి రమణుని సేవించె
రుక్మిణివలె భాగ్యరూఢిగాంచె
ననసూయపోలిక నన్నినోములు నోచె
వాణిరీతిఁ బవిత్రవాణియయ్యె
వినతచందంబున వినుతశీలముఁ బూనె
రోహిణీకరణి సద్రుచివహించె
భూదేవిమాడ్కి సొంపుగఁ దాల్మి చేమించె
మితసూను నెరపెడు సుమిత్రభాతి
నన్నదానములిడె విశాలాక్షిభంగి
భూప్రజలఁ గల్పలతవోలె బ్రోదిసేసె
దంతులూరి రామభూవరోత్తముని పుత్రి
ఖ్యాతసద్గుణనికురంబ సీతమాంబ.

శా. సీతాదేవికి సాటియైనసతికిన్ సీతమ్మకున్ విక్రమ
ఖ్యాతిన్ రాఘవతుల్యుఁడౌ జగపతిక్ష్మాభర్తకున్ బుత్రుఁడై

చేతోజాతసమానమూర్తి జనియించె న్వాసవాంశంబునన్
శ్రీతిమ్మప్రభుసార్వభౌముఁడు ధరాసీమంతినీకాంతుఁడై

శా. దేవబ్రాహ్మణభక్తికిన్నృహము విద్వేషిక్షమాజానిసే
నావారాశికి మందిరాద్రి గుణరత్నశ్రేణికాధాగము
ర్వీవామాక్షికిశోభనాశ్రయముదోర్వీశ్రాంతికిన్నావు వి
ద్యావిత్తంబులరాశితిమ్మనృపుఁడేతన్మాత్రుఁడేయెన్నఁగన్.

ఉ. శైలము సర్వలోకసురసంఘనికేతనమైన మేరువే
సాలముయాచకాభిమత సంపదలిచ్చుసుపర్వభూజమే
శీలముసజ్జనోపకృతిసేయగజాలుచరిత్రమే మహీ
పాలుడులోకరంజన కృపాలుడు తిమ్మనృపాలుడేభువిన్.

సీ. సిరిగందమునదావి విరివినొందినతీవి
మవ్వంపుగోజ్జంగిపువ్వునీట
జలువజొబ్బిలురీతిదలువలచెవియందు
తళతళవెన్నెల వెలయుభాతి
జిలికికడానిపైడికి జగాజిగిమాడ్కి
మీరి చీనావంచదారపాన
కమునఁదియ్యఁదనంబుకై వడి దలపుమా
నికమునాసంబు నెగడుకరణి
వత్సవయతిమ్మభూపాలవరునియందు
బండితాశ్రితవరకవిపక్షపాత
గుణముసహజంబుగాగ బాగుగ్గరచించె
ధర్మనిర్మాణగుణశాలితిమ్మిచూలి.

చ. ఘనుని సృజించి పెండియుఁ గల్పమహీరుహ కామధేనులన్
మొనసి సృజించి కర్ణశిబిముఖ్యుల నెల్ల సృజించి ప్రోడయై
వనజభవుండు వత్సవయవంశమునందు సృజించె నెవ్వనిన్
ఘనతరనిత్యదానగుణగణ్యునిఁ దిమ్మనృపాగ్రగణ్యునిన్.

గీ. అసురబాణాద్రులకు నునవాద్రితతికి
మఱియు శైలాద్రులకు హెచ్చుమహిమ గాంచె
వత్సవయతిమ్మ జగతీశ్వరుని మహిత
వితరణద్యుతిధీర తావిలసనములు.

శా. బాలామన్మథ వత్సవాయకులశుంభద్దీప్రుడౌ తిమ్మభూ
పాలుండాశ్రితసూరి సంఘములకున్ బల్కారు తానిచ్చు మేల్
శాలూలుం గనకాంబరంబులును భూషారత్న సద్వస్తువుల్
లీలన్నోస్రములు వేయుగల్గుఫణియున్ లెక్కింపఁగా నేర్చునే.

ఉ. వేలకు వెల్తిలేని జవాలివిత్తపురాసులు గోసహస్రముల్
మేలగురత్నహారములు మిక్కిలిసొమ్ములుఁ బాలకీలు హా
లూలుగు టాలు నందలములున్ భువనోన్నతభోగముల్ నగా
రాసులు గల్గెఁ దిమ్మనృపరత్నము ప్రోపున రాచవారికిన్.

ఉ. శ్రీయుతుఁడై మహాపురుష శేఖరుఁడై ప్రియదారపుత్త్రదీ
ర్ఘాయురుపేతుఁడై నృపసమర్పిత సైంధవగంధసింధుకో
పాయసపూర్ణుఁడై సిరికిఁ బ్రాపయి వత్సవయాన్వయార్ణవా
త్రేయుఁడు తిమ్మభూవరవరేణ్యుఁడు రాజ్యము లేలుగావుతన్.

వ. ఇవ్విధంబున శ్రీరామపరాజపురందరుని సంతానంబు వర్ధ

మానంబయ్యె. ఇమ్మహారాజులయిన గోపాలరాజ రామ
చంద్రినరేంద్రిలసంతతిక్రిమంబు వర్ణించెద.

క. సూరపమహీపతియు సీ
తారామనృపాలమణియు దాసఘనుఁడా
శ్రీరామచంద్రరాజును
ధీరులుగోపాలరాజ దేవేంద్రిసుతుల్.

సీ. వివిధార్థిసకలార్థవితరణదక్షులు
తపనకుమారుఁడీ ధరణిపతియు
సత్యవాక్యప్రితిష్ఠాపనాచార్యులు
ధర్మసుతుండు నిద్ధరణిపతియు
సంగరరంగప్రిశస్త శౌర్యాధికుల్
దారకారియును నిద్ధరణిపతియు
దరుణీమణీమనోహార రూపశాలులు
విరివింటి జోదునిద్ధరణిపతియు
ననుచుఁదనగుణసంపద లనుదినంబు
పాఠకులువర్ణనము సేయఁబ్రిభవహించె
భాగ్యనిధివత్సవాయ గోపాలరాజ
నందనుఁడు సూరరాజపురందరుండు.

శా. ఆసూరప్రభుమౌళిపుత్రుడు మహోదారుండుశూరుండువి
ద్యాసర్వజ్ఞుఁడు బంధుసమ్మతుడు మేధాదేవతామంత్రినా
రీసూనాస్త్రిడు బ్రిస్తుతింపగదగున్ శ్రీరాజగోపాలుడు
ల్లాసప్రోజ్వల మానసాంబుజుడు లీలామానవుండుర్వరన్.

నీతియుతులు సీతారాము నృపునిసుతులు
ఘనుడు సూరపరాజు వేంకటవిభుండు
జగ్గరాజునుహారిహార. జలజసంభ
వాంశజనితులుబంధు జనానుసుతులు.

ఉ. ఇందుపురందరాశ్వగిరిజేశ్వర చందనకుంద తారకా
బృందసమానకీర్తి రిపువిభీషణపౌరుష శాలిదేవకీ
.నందనవందన వ్రితధనంజయుడంబురహాసవరప్రిభా
సుందరమూర్తివత్సవయసూరనృపాలుడు రాజమాత్రుడే.

ఉ. వేంకట శైలనాయకుని విష్ణునిభూరికృపాంబుధిన్ మనః
పంకజసీమనిల్పిదృఢభక్తినిపూజలుసేయుధన్యుని
శ్శంకుని మందహాసవిలసన్ముఖపద్మునిమెచ్చవచ్చుశ్రీ
వేంకటరాజశేఖరుని విశ్రితవత్సవయాన్వయోత్తమున్

ఉ. అగ్గలమైనయుద్ధదురహంకృతిచే నెదిరించు వైరులన్
దిగ్గుననుగ్గుసేయగల ధీరులకగ్రిసరుండుతద్దయున్
బెగ్గిలివేడుచున్న రణభీరుల బ్రోచుదయావయోధిశ్రీ
జగ్గనరేశ్వరుండతనిసాటి ధనంజయుడెంతతలంపగన్.

వ. అందు.

మ. ఘనుడౌసూర్యనృపాలశేఖరునకున్ గాంభీర్యరత్నాకరుల్
దనయుల్ధన్యులుసంభవించిరి దయాదాక్షిణ్యసంశోభితుల్
వినయశ్రీనిధి జోగిరాజమణియున్ విఖ్యాతసౌందర్యనూ
తనమీనాంకుడనంగసాంపమరు సీతారామరాజేంద్రుడున్.

వ. అందు.

ఉ. దాతలలోన మేటి హిమధాముడు సోమునికన్న గల్పభూ
జాతము పెద్దచంద్రసురశాఖలకన్నను మేలుబంతిరా
ధాతనయుండు రాజవిబుధదుృమకట్లలకన్న దానవి
ఖ్యాతుడు వత్సవాయకులగణ్యుడు జోగినృపాలుడిమ్మహిన్.

ఉ. రాజులలోన దేజమునరాజిలు జాణకవిత్వవిద్యచే
భోజుడుపాలితాంధ్రశకభోజకలాట కళింగవంగకాం
భోజుడుమందహాసరసపోషితభాషితభూషితానునాం
భోజుడు వత్సవాయకులపూజ్యుడు జోగినృపాలుడెన్నగన్.

గీ. ఈగిరాజుకన్న హెచ్చునగావచ్చు
జోగిరాజుకన్న బుద్ధిశాలి
భోగిరాజుకన్న భువనంబులో నెన్న
చూడవత్సవాయ జోగిరాజు.

క. పాలిచ్చు కామధేనువు
పూ లెవ్వనికిచ్చు గల్పభూజము సొమ్ముల్
శాలూలు వేలకొలది వ
రాలుగు తాలిచ్చు జోగిరాజేంద్రుడిలన్.

శా. వీరాగ్రేసరుడై పవిత్రాపనిధియై విద్వజ్జనస్తుత్యుడై
పారావారగభీరుడై రిపుచమూపాలచ్ఛిదాదక్షుడై
నూరత్నావతిపుత్రుడై మహిమచేసొంపొందుధన్యుండునీ
తారామక్షితినాధశేఖరుడు సీతారామతుల్యుండిలన్.

క. జగదేకవీరుఁ డితఁడని
జగములువర్ణింప ధైర్యశౌర్య ప్రౌఢిన్
బొగడిహసించెన్భళిరా
జిగిమిగులఁగవత్సవాయ సీతన్నమహీశ.

క. ఎన్నఁదగువత్సవయశూ
రన్నకసుతుఁడైన జోగిరాజేంద్రుసుతుల్
సన్నుతచరితులుగుణసం
పన్నులు సూరనరనాథ బలభద్రనృపుల్.

ఉ. భోగముసౌఖ్యముస్థ్సృతియుపుణ్యమువైభవమున్నిరాయుషన్
శ్రీగురుభక్తియున్యశము జెవ్వము మేలును గల్గినట్టిఁ నో
ద్యోగసమగ్రుఁడై సుతులతో సిరితోసుఖయించుగాత శ్రీ
జోగినృపాలునందనుఁడు సూరపరాజు మహోన్నతస్థితిన్.

ఉ. ధాతకుసాటి విద్యల బుధస్తుతవిక్రమయుక్తిచేతమాం
ధాతకుసాటి యీవి జలదాతకు సాటి సుకీర్తిచేనిశా
నేతకుసాటియైతగిన నేర్పరియై బలభద్రరాజువి
ఖ్యాతివహించె నౌర మనుజాధిపతుల్దనభాగ్యమెన్నఁగన్.

మ. వినయోపేతులు వేదమూర్తులధికుల్ వెంకయ్యకున్నందను
ల్లనుడౌ వేంకటకృష్ణుఁడున్ సులలితాకారుండుసీతన్నయున్
జినజోగిప్రభుచంద్రుఁడున్ సుకృతియౌశ్రీసూర్యరాజేంద్రుఁడున్
వనజాక్షు చతుర్భుజంబులఁగతిన్ వర్ధిల్లిరభ్యున్నతిన్.

సీ. విష్ణుపూజాభి వర్ధిష్ణుండు సంగ్రామ
జిష్ణుండు వేంకట కృష్ణఘనుఁడు

మాన్యవిశాలుఁడౌ పన్నగశయనుసం
పన్నశేఖరుఁడు సీతన్న
భోగదేవేంద్రుఁ డభ్యాగతసుముఖుండ్డు
వాగీశతుల్యుండు జోగి
రాజీవబాంధవతేజుండు సత్కళా
భోజుండు నూపరాజన్య
వత్సవయ వేంకటపతీశ్వరుని సుతులు
భువనసమ్మతచరితులు పుణ్యయుతులు
వార్త కెక్కిరి సకల భూవరసభాంత
రముల విద్వజ్జనంబులు బ్రస్తుతింప.

గీ. రామచంద్రమహీపాల రత్నమునకు
సుతులు గోపాల కృష్ణభూపతియుఁ బేర
రాజమౌళియు రఘునాథ రాజనంగ
జాలవిఖ్యాతిఁగాంచిరి సభలలోన.

క. గోపాలకృష్ణభూపతి
గోపాలస్వామికృపను గుణసాగరుఁడై
దీపించె సాధుజనర
క్షాపారీణప్రభావ సామ్రాజ్యమునన్.

శా. శ్రీకాంతాంఘ్రిసరోజభక్తినిధియై శ్రీవ
శ్లోకుండై బహుధర్మకార్యపరుఁడై సుక్షే
రాకాచంద్రసమానకీర్తియుతుఁడై రా
లోకుల్మెచ్చఁగ హెచ్చె బేరనృపుఁడుల్లోక

గీ. అగ్రజన్ములయందు నిజాగ్రజన్ము
లందఁ గడుసముద్రుఁడై పేరుఁ జెందెనార
రామచంద్ర నరేంద్రు గారాపుసుతుఁడు
రమ్యగుణశాలి రఘునాథ రాజమౌళి.

గీ. తిమ్మనృపరామచంద్రు ధాత్రీవిభునకు
బుత్త్రులిద్దరు త్రిభువనాద్భుత చరిత్రు
లందుఁ బెద వేంకటాద్రి రణార్జునుండు
విష్ణుసమవిక్రముఁడు చిన వేంకటాద్రి.

గీ. పేరభూపాలమౌళికిఁ బ్రియతనూజుఁ
డైన చినజగ్గనృపతికి సూనుఁ డగుచుఁ
బేరుగాంచెను దమతాత పేరుపూని
పేరభూపతి వితరణసారశాఖ.

శా. ఆ పేరప్రభునందనుండు రిపుబాహాగర్వ నిర్వాపణ
వ్యాపారాభిరతుండు గర్ణశిబిదుగ్ధాంభోధివిశ్రాణనా
టోపక్షేపకనిత్యదాన మహిమాఢ్యుండాదిగర్భేశ్వరుం
డాపూర్ణస్థిరకీర్తి జగ్గవసుధాధ్యక్షుండు దండిలన్.

వ. ఇది శ్రీపేరరాజచంద్రుని సంతతిక్రమంబు. ఇటమీఁదఁ
బెదవేంకటపతిరాజు సంతతిక్రమం బెట్టిదనిన.

క. పెదవేంకట భూవరునకు
సుదతీమణి యెల్లమకును శూరవరేణ్యుం
డుదయించెఁ బుత్త్రుఁడు జగ
దుదితుఁడు పినబాపిరాజు తేజము వెలయన్.

గీ. పెక్కటయశుఁడగు పినబాపరాజసుతులు
రామభూపాలుఁడును వెంకటభూమిపతియు
బాపిరాజును శాశ్వత భాగ్యనిధులు
వారలకు వారలేసాటి వసుధలోన.

గీ. పుణ్యమతిచిన వెంకట భూవరునకు
శుభచరిత్రముమ్మక్కకు సుతుఁడు పుట్టె
శత్రుమర్త్వర్గపర్వత శాంతిహేతు
హేతిశతకోటిజగ్గరాజేంద్రుఁడనఁగ.

గీ. జగ్గనృపుసుతుల్ వెంకటజనపతియును
ఘనుఁడు మంగళగిరిరాజు వినయశాలి
బొజ్జవెంకన్నయును కృష్ణభూభుజుండు
చాలవినకరిఁగాంచిరి జగములోన.

వ. అందు.

క. వడిగల గుర్రపురౌతుల
బొడిచెను గోపాలరాజపుంగవు నెదుటన్
గడు పేరుగాంచె నళిక
వ్వడివలె వేంకటవిభుండు వరశౌర్యమునన్.

గీ. విక్రమార్కుఁడె సాహసవిభవయుక్తి
ధరణిరేఁడవకర్ణుఁడె దానశక్తి
విజయుఁడే కృష్ణచరణారవిందభక్తి
జగ్గనృపు వెంకటక్ష్మాజాని భళిరె.

చ. పులిఁగనుఁగొన్న జింక గమిఁబోల్కి మహాభయకంపితాంగులై
తొలఁగుదు రాహవక్షితిని దుష్టవిరోధివరూథినీపతుల్
బలవదహీంద్రసన్నిభ కృపాణభయంకరవత్సవాయసుం
గళగిరి రాజపుంగవుని గాంచి నిరస్తసమస్తధైర్యులై.

గీ. బొజ్జ వెంకన్నగారికి నిజ్జగమున
సాటియగు శౌర్యశాలి కిరీటియొకఁడు
కృష్ణనృపతికి రిపుగజకేసరికిని
భీమసేనుండె సాటిసంగ్రామమహిమ.

గీ. భాగ్యసహితులు వెంకటప్రభునిసుతులు
శ్రీజగన్నాథధరణీశ శేఖరుండు
ఘనుడు వెంకటపతియు వెంకటపతియన
బరగు పెదమాళ్ళరాజును బ్రౌఢమతులు.

వ. అందును,

సీ. వ్యాఘ్రేశ్వరస్వామి వరదుఁడై కృపతోడఁ
దోడమాటాడు నేప్రోవతోడ
మాళూరుదళపద్మనీలాబ్జకోటుల
హారునిబూజించు నే ధరణిభర్త
మృష్టాన్నసత్రంబులీశ్వరప్రీతిగాఁ
గల్పించె నేరాజు కాశిలోన
గజవాజిరత్న సంఘములిచ్చి దేశాధి
పతులు సేవింతు రేభాగ్యవంతు

నతఁడు ప్రతిదినవిహితదానాదికంబు
పూరసముదయసంయోగభూరివర్ధ
శార్ణవుఁడు వేంకటక్షితీంద్రాగ్రసుతుఁడు
పొగడఁదగు వత్సవయ జగ్గభూవరుండు.

సీ. పరిపూర్ణజలపద్మపద్మాకరంబులుఁ
దవ్వించె బెక్కులు తగినయెడల
యోజనవిస్తారయత బహుఫలవృక్ష
వాటికల్నిర్మించె వసుధనెల్ల
అలిసదావృత్తి గొల్లలమామిడాడలో
నిల్పె తెర్థికులను నెమ్మిఁబ్రోచె
రాజమహేంద్రపురంబున ద్వాదశీ
భోజనసత్రంబు బొంకపఱచె
మఱియును బుల్లేటికుర్తిలో మంటపములు
గోపురంబులు శివునకు ధూపదీప
సకలభోగోపచారముల్సంఘటించె
ధన్యుఁడగు వత్సవయజగ్గధరణివిభుఁడు.

ఉ. సాహసవిక్రమార్కుఁడని సర్వనృపాలురుబ్రస్తుతింప ను
త్సాహముఁబూనికార్యములు జక్కఁగదిద్దినిజాముచేత స
ద్వాహనభూషణాంబరసువస్తుతతుల్బహుమానమందె శే
షాహినుతింపఁగావలె సహస్రముఖంబుల జగ్గభూవరున్.

చ. కవికులసార్వభౌముఁడనఁగాఁదగు నేనుగలక్ష్మణార్యుచే
ధ్రువచరిత్రప్రబంధము బుధుల్వినుతింపఁగనందిభోగభూ

గ్ఫచనమహాసుఖానుభవకారణమైనయశంబుగాంచె వా
సవవిభవుండు వత్సవయ జగ్గనృపాలుఁడు సద్గుణోన్నతిన్.

గీ. ఇలను శాస్త్రోక్తమగు ధర్మమెంత కలుగు
నంతయును సంగ్రహించి మహాధనంబు
పగిది నగ్రాణములనించి పదిలపఱచె
జగ్గశౌరికి సాటియె జగతి నృపులు

క. కడలి పెనువలువఁదాల్చిన
పుడమికి నొడయుఁడగు తిమ్మభూపతికెపుడున్
గుడిభుజమై వర్తించెను
గడుధన్యుఁడు జగ్గరాజు ఘనభాగ్యమునన్.

ఉ. బుద్ధిని రూపసౌష్ఠవవిభూతిసమృద్ధిని మంత్రనీతిసం
సిద్ధిని దండ్రితోసముఁడు శేషునితోసముఁడంబుశోక్తులన్
యుద్ధనిరూఢి పార్థసముఁడూర్జితకీర్తి వహించె మేల్భళీ
శుద్ధగుణుండు వెంకటపతీంద్రుఁడు కారణజన్ముఁడిమ్మహిన్.

వ. అతని సోదరుండు.

సీ. బంధుసముద్రుండు బలబలభద్రుండు
విజ్ఞాననిలయుఁడు విదితనయుఁడు
గురుభక్తిపూర్ణుండు వరదానకర్ణుండు
విబుధరక్షణవతిఁ విమలకీర్తి
శేముషీఫణిరాజు కామినీరతిరాజు
సుస్థిరాయుర్వృద్ధిసూక్ష్మబుద్ధి

కాంతిసుధాసూతి ఖడ్గహతారాతి
యఖిలార్థవేది విద్యావినోది
యనుచు బుధరాజ బాంధవు లనుదినంబు
దనగుణంబులు వర్ణింపధరణియేలె
వత్సవయ వెంకటక్ష్మావరుని సుతుండు
ప్రణుతరుచిహేళి పెరుమాళ్ళ రాజమౌళి.

గీ. వత్సవాయ జగన్నాథవసుమతీశు
ననుగు పట్టపుదేవియై యతిశయిల్లె
హరికి సిరివలెహరునకుగిరిజవోలె
రమ్యసద్గుణనికురంబ రంగమాంబ.

సీ. ఆరంగమాంబామహాదేవికిని వత్స
వయ జగన్నాథ భూవల్లభునకు
వెంకటేశ్వరకృపావిభవంబుచే సంభ
వించిరిసుతులు ప్రవీణమతులు
వినుతవాక్పతిరాజు వెంకటపతిరాజు
రారాజు వెంకటరామరాజు
పండితేంద్రస్తోత్రపాత్రమహాధైర్య
గిరిరాజు వెంకటకృష్ణరాజు
బ్రహ్మవిష్ణుమహేశ్వర ప్రతిమలనఁగ
నలవసంతజయంత సుందరులనంగ

ఁగినపుణ్యులుమానవోత్తమశరణ్యు
లానతన్నృపప్రవర్ధనుల్ దానఘనులు.

వ. అం దగ్రజుండు.

చ. కరుణకుఁ బాదు విష్ణుపదకంజయుగస్థిరభక్తి కాశ్రయం
బురుతరనీతికి న్విడిది యూర్జితకీర్తికిఁ బట్టుఁగొమ్మ భూ
సురులకు వజ్రపంజరము శోభనసంపదకెల్లఁ గేళిమం
దిరము భళీరెవెంకటపతి ప్రభురత్నము రాజమాత్రుఁడే.

ఉ. ఆయన సోదరుండు వసుధామరవాంఛితవస్తుదానరా
ధేయుఁడు సత్కవీశ్వర విధేయుఁడు సంగరరంగశౌర్యగాం
గేయుఁడు పాఠక ప్రవరగేయుఁడు వెంకటరామభూవరుం
డాయతసాహితీ గసపరాయణుఁ డద్భుతశీలుఁడెన్నఁగన్.

శా. ఆరాజద్వయి సోదరున్ రిపునృపాహంకారవిస్ఫూర్త మో
వారచ్ఛేదనజాగ్రదుగ్రతమ గుర్వారపరితాపార్క న
ఙ్ఞారిస్వర్గతరంగిణీ సమసఖ్యాపూత లోకత్రయున్
వీరున్వేంకటకృష్ణరాజు ననఘున్వేమారు నెన్నందగున్.

సీ. శ్రీకృష్ణుఁ డీధరిత్రీజానిదీనికి
సంభృతాచలుఁడౌట సాక్షిగాదె
విజయుఁడీమేదినీభుజుఁడు దీనికినర్జు
ననమాఖ్యుఁడౌట మానంబుగాదె
దేవేంద్రుఁ డీరాజు దీనికి రిపుబలా
ర్దనుఁడౌటయదినిదర్శనముగాదె

భాస్వదీధారుణీభర్త దీనికి సార
సహితుఁడై యుంట సూచకముగాదె
యనుచు విద్వాంసు లూహింప నధికధైర్య
చావనైపుణ్యభోగ పరితాపములను
వెలసె శ్రీవత్సవయ జగ్గవిభునిసుతుండు
జిష్ణువిభవుండు వెంకటకృష్ణవిభుఁడు.

శా. జ్యోతిష్కుల్ మాయవైద్యశాస్త్రకుశలుల్ సాముద్రికుల్ [శాబ్దికుల్
శ్రోత్రుల్ నానకళావిదుల్ గొలువగా సర్వోర్విభూనాయకుల్
జేతుల్ఫాలములందు జేర్చి పరిణతుల్సేయంగఁ గొల్వుండువి
ఖ్యాతిన్వెంకటకృష్ణభూవరుడు భోజాధీశుచందంబునన్.

సీ. నలినసంభవుని పైదలి వేణికాభరం
బునఁబొందుమల్లియ పూవుదండ
కనకాచలేంద్రచాపునిమనోహరగళ
స్థలమున నిర్మలస్ఫటికసరము
చలువరాయని సువిశాల బాహాంతర
తనమున నాణిముత్యాలపేరు
భోగిరఫుజడదారివల్లకిమీఁద
లాలితధవళ నిచోళకంబు
నగు మనాత్మీయకమనీయయశము గొనుచు
తత్తదుచిత దేశపరిష్కార యుక్తి మెఱయు

వసుధ పాలించె శ్రీవత్సవాయకులాబ్ధి
చంద్రుఁడైనవెంకటకృష్ణజనవిభుండు.

క. అటునిటుఁ బోనేరకసం
కటవడివిధిదూరి పూరిగఱతురురణాలం
పటుభటులు వత్సవయవెం
కటకృష్ణుని చేతిహేతిఁ గనుఁగొనభీతిన్.

క. ఆవెంకటకృష్ణధరి
త్రీవిభుఁడువరించె సుందరీదేవిని ల
క్ష్మీవారిరుహదళాక్షిని
శ్రీవిష్ణువు మోదమున వరించినకరణిన్.

ఉ. పంకజమిత్రతేజులుఁ గృపాపరిపూర్ణులు సుందరాంబకున్
వెంకటకృష్ణశౌరికి జనించిరి పుత్రులుయుద్ధరంగని
శ్శంకులు శత్రుభైరవలసద్బిరుదాంచితులు రమ్యనామమా
నాంకులుజగ్గరాజనుగుణాఢ్యుఁడు రాఘవరాజచంద్రుఁడున్

వ. అందు,

చ. గెలుపులకుత్తి దిగ్విదితకీర్తిసుమంబులపొత్తికూళరా
దళములకంఠపాళియును తామరకున్మదహస్తిదాయలన్
బలిగొనుమిత్తిద్విట్తిమిరపంక్తికి భాసిలుదీపవర్తిని
శ్చలగుణవృత్తివత్సవయజగ్గనృపాలుని కత్తిమేల్భళీ.

ఉ. ముగ్గురువేలుపుల్దనకుమూర్తులుగాఁగ జగన్నిదానమై
యగ్గలమైచెలంగు నిగమార్థమెఱింగిన పుణ్యవర్తికిన్

దిగ్గజతుల్యశూర్తికి సుధీనుతకీర్తికి వత్సవాయ శ్రీ
జగ్గనృపాలచంద్రునకు శాశ్వతధర్మము గల్గె నెన్నఁగన్.

క. నటనపటుధూర్జటిజటా
కటాహరట దమరతటిని కాపీచిఘటా
స్ఫుటరుచులు వత్సవయ వెం
కటకృష్ణుని జగ్గరాజు ఘనతరకీర్తుల్.

క. ఆ జగ్గరాజుతమ్ముఁడు
భోజుఁడు విద్యల విరోధిపూజితపాదాం
భోజుఁడు భళిశ్రీరాఘవ
రాజు విరాజిల్లు నృపతిరత్నంబనఁగన్.

చ. నెలకొకమారు విప్రులకు నిశ్చలభక్తిని రెండువేలకున్
పలకలమాన్న భక్ష్యఘృతపాయస ముఖ్యపదార్థకోటితో
మెలఁకువభోజనంబొసగు మిక్కిలి దక్షిణలిచ్చి మ్రొక్కు ని
ర్మలతకీర్తి వత్సవయ రాఘవరాజు మహోన్నతస్థితిన్.

ఉ. బాహుబలంబు మీఱఁగ నశాబులతో నెదిరించి యాహవో
త్సాహము విస్తరిల్ల జయసంగతుఁడై పరదేశనాయక
వ్యూహము తల్లడిల్లఁగ మహోన్నతిఁ గాంచి సమస్తరాజ్యని
ర్వాహ మొనర్చె వత్సవయ రాఘవరాజు నృపాలమాత్రుఁడే.

సీ. భాస్వత్కులప్రదీపకమూర్తి యనఁబొల్చి
పరిఖ్యాతసహజసంపద దనర్చి
నిజధర్మసంప్రాప్తవిజయోన్నతి వహించి
లేఖరాజాత్మజులీల గెల్చి

పరవాహినీశభీకరవిక్రమముఁజూపి
హారిసహాయుతశత్రువరులనడఁచి
ధీరాభివంద్యపార్థివలక్ష్మితోఁ గూడి
యచలితగురుభక్తి నతిశయిల్లి
యాశ్రితులఁ బ్రోచు కౌశలంబధిగమించి
సకలసద్గుణమణిగణజలధియగుచు
నెన్నవాయాన్వయంబున వన్నెకెక్క
బ్రకటబలశాలి రాఘవరాజమౌళి.

ఉ. స్నానముసంధ్యయుజ్జపముశంకరపూజనపాదపంకజ
ధ్యానమురామభారతకథామృతపానము విప్రపూజయున్
దానముధర్మముల్ప్రతిదినమును మానక చేయుచుండు నా
రాజితధర్మవర్తనుఁడు రాఘవరాజపురంబునుండెలన్.

సీ. ఫలభూజవనములు బహుతటాకంబులు
దేవాలయంబులుదీర్ఘికలును
బ్రహ్మప్రతిష్ఠలుంబ్రతి కార్తికారబ్ధ
భవ్యాజ్యలక్షదీపవ్రతములు
వ్యాఘ్రేశలింగ సేవామహోత్సవములు
నిరతాన్న దానంబు గురుసపర్య
సజ్జలమార్గపానీయశాలావిని
ర్మాణంబుబుధబంధురక్షణంబు
మొదలుగాధర్మములుజగద్విదితముగను
హెచ్చితమతాతవలె సంగ్రహించెనార

వీరవెంకటకృష్ణభూవిభుని సుతుఁడు
వత్సవయ రాఘవక్ష్మావల్లభుండు.

గీ. వెంకటనృపాలతనయుండు వెంకటపతి
యనఁగఁదగినట్టి పెరుమాళ్ళమనుజభర్త
దాననిపుణులఁ బంచనందనులఁ గనియెఁ
గల్పతరువులఁ గన్న పాల్కడలికరణి.

వ. అందు.

చ. సురపతితుల్యభోగియగు జోగినృపాలుఁడు పంచబాణసుం
దరుఁడగు జగ్గరాజువదాన్యులలోపల నగ్రగణ్యుఁడౌ
తిరుపతిరాజు మేరునగధీరుఁడు పాపయరాజు సద్గుణా
భరణుడు వెంకటప్రభుఁడు భాసురకీర్తి వహించిరిమ్మహిన్.

వ. అందు.

చ. ఘనుఁడనిబుద్ధిమంతుడని గర్వమొకింతయు లేనిసజ్జనుం
డని కరుణాసముద్రుఁడని యాశ్రితభూసురబంధురక్షకుం
డని జనులెన్నఁగా గుణగణాకరుఁడై పెరుమాళ్ళరాజనం
దనుఁడగుజోగిరాజుగడుధార్మికుఁడై విహరించెఁగీర్తులన్.

గీ. పలుకఁడనుచితంబుఁబరిహాసమునకైన
నిందచేయఁడరులయందునైనఁ
బరమధర్మమూర్తి పెరుమాళ్ళరాజు కు
మారుఁడైన జగ్గమనుజవిభుఁడు

సీ. అనిమొనలో నెదిర్చిన వైరివీరుల
సమయించుచో ధనంజయుఁడనంగ

మానినీజనగణచూర్ణముల్ గరగించి
వలపించుచోఁ బచ్చవిలుతుఁడనఁగ
ననివారితముగఁ గోరినధనంబులు యాచ
కశ్రేణికిచ్చుచోఁ గర్ణుఁడనఁగఁ
బద్ధతిమీఱకసద్ధర్మవర్తియై
ప్రజలఁ బాలించుచో భరతుఁడనఁగ
సమయసముచితవర్తనచతురుఁడనఁగ
నఖిలరాజసభాంతరఖ్యాతిఁ గాంచె
వత్సనయ పెరుమాళ్ళభూవరునినుతుఁడు
పూజితమురారి తిరుపతిభూపశౌరి.

ఉ. భావనచేసి శేషనగభర్తను గొల్వఁగ నేర్చుఁ జాలసం
భావనలియ్య నేర్చు రిపుపార్థివులన్ వెడలించ నేర్చు భూ
దేవతలన్ భజించి తగ దీవన లెప్పుడు నంద నేర్చు నా
దేవుఁడు గాక శ్రీతిరుపతిప్రభురత్నము రాజమాత్రుఁడే

సీ. కొండంతపొడవగుగుడి సాంబశివునకు
రచియించె ధర్మవరంబులోన
శంభులింగమునకు సంతతోత్సవములు
సకలభోగంబులు సంఘటించె
నచ్చోటసర్వప్రజానంద మొనరించు
ఫలవృక్షవాటికాప్రతతులు నించెఁ
బదివేలుసహకారపాదపంబులు బ్రతి
పాటిచెంగట నిల్పి వరలఁ జేసె

మధురసలిలతటాక నిర్మాణముఖ్య
ధర్మములొనర్చె నాచంద్రతారకముగ
వత్సవయ పెరుమాళ్ళభూవరునిసుతుఁడు
వ్రికటగుణశాలిపాపయ్యరాజమౌళి.

ఉ. లోభములేనిదాత కుశలుండగు ప్రోడ సదాన్నదానసం
శోభితుఁడైన పెద్దరణశూరుఁడనందగుజాణ సద్యశో
లాభముఁజెందు మేటి శుభలక్షణముల్గలరాజుశాశ్వత
ప్రాభవుఁడైనవత్సవయపాపయరాజుకృతార్థుఁడన్నిఁటన్.

చ. పలుకుశిలాక్షరంబుదనభావముచందనశీతలంబుగా
నులలితమూర్తియైసుగుణశోభితుఁడై నిరతాన్నదాతయై
యిలఁగలభూసురోత్తములకెల్లను వేఁడుకతోధనంబుఁగు
ప్పలుగనొసంగు వత్సవయ పాపయరాజునమున్నతస్థితిన్.

ఉ. అన్నలకున్విధేఁయుఁడయి యన్నలకూబరునన్నలాధిపున్
బన్నగరూపుచేగెలుచుఁబ్రౌఢవిలాసుఁడనంగభాగ్యసం
పన్నుఁడనంబ్రసిద్ధిగలపావనమూర్తినిమెచ్చవచ్చునా
మన్నవిభాలుఁడైన పెరుమాళ్ళనృపాత్మజువెంకటప్రభున్.

వ. అందును.

క. తిరుపతినృపతికిజన్మిం
చిరివెంకటరామరాజుశ్రీమంతుండౌ
పెదమాళ్ళ రాజుమిక్కిలి
నరసుమనారాయణాఖ్యజననాథుఁడున్.

౪. వెంకటరామన్నృపాలుఁడు
పంకజలోచనునికృపకుఁబాత్రుఁడురణని
శ్శంకుఁడుకాంతివిశేషమ్ము
గాకుంఠునై వృద్ధిఁబొందెనంచితకీర్తిన్.

౫. అమ్మహాత్మునితమ్ముఁడునమ్మియున్న
ప్రజలఁబోషించుఁబెరుమాళ్ళరాజశౌరి
యతనిసోదరుఁడైననారాయణావ
నీశ్వరుఁడు హెచ్చె భోగసురేశ్వరుండు.

౬. భాగ్యనిధియైన పెరుమాళ్ళపార్థివునకుఁ
దనయుఁడైనట్టి పాపయమనుజపతికి
సుతులుగల్గిరి వెంకటపతియుభాగ్య
శాలితిరుపతిరాజునుసాధుహితులు.

౭. ఆ వెంకటపతిభూపతి
భావజునకుసాటిరూపభాసురలీలన్
గావలసినవస్తువు భూ
దేవతలకునిచ్చుఁదిరుపతిప్రభుఁడెలమిన్.

౮. వెంకటరాజచంద్రునకునిశ్రుతకీర్తికిఁబుత్రరత్నముల్
బంకజనాభుసత్కృపనుభాగ్యనిధుల్ జనియించిరారని
శ్శంకులుమెచ్చఁగాఁదగినసద్గుణముల్గలవారలెప్పుడు
న్వెంకనివారుకృష్ణనృపపుంగవుఁడున్బెరుమాళ్ళశౌరియున్.

వ. ఇది వెంకటరాజేంద్రునిసంతతిక్రమంబు; ఇమ్మహా
త్ముని సోదరుల సంతతిక్రమంబు వర్ణించెద.

క. మంగళగిరిరాజసుతుల్
సంగరనిశ్శంకమతులు జగ్గవిభుండున్
మంగళగిరిరాజు నురుచి
రాంగుఁడు వెంకటనృపాలుడనఁదగు వారల్.

వ. అందు.

గీ. దిగ్గజంబులరీతి దృఢబలవంతుఁడై
యగ్గలముగఁ బ్రబలె జగ్గరాజు
సంగరాంగణమున సవ్యసాచియనంగ
మంగళగిరిరాజు మహిమ గాంచె.

చ. గురువులయందు భక్తియును గూళలయందు విరక్తియు న్మహో
ద్ధురరణవీథిలో సదృఢశౌర్యగశక్తియు గల్గుధన్యుడై
సరసులు మెచ్చ వత్సవయసత్కులగణ్యుఁడు వెంకటక్షితీ
శ్వరుడు సధర్మవర్తనుఁడు వార్తకు నెక్కె సభాంతరంబునన్.

గీ. ఆశితప్పఁడు సేయఁడన్యాయచింత
వదలఁడెన్నఁడు సన్మార్గవర్తనంబు
బుణ్యుఁడని జనులందఱు పొగడ నెగడె
రాజమాన్యుండు వెంకటరాజఘనుఁడు.

వ. అట్టి వెంకటరామచంద్రునకుఁ దిరుపతివెంకటేశ్వ
రప్రసాదలబ్ధవిభవభాసురుండగు తిరుపతిరాజశేఖరుండును, సం

గర విజయరాజమాన్యుండగు మంగళగిరిరాజును, దిగ్గజసమాన బలవిశాలుండగు జగ్గభూపాలుండును, శృంగార విజితమకరధ్వజుండగు సింగమహీభుజుండును, మేరుభూధరధీరుండగు పేరనరేంద్రుండును, వియచ్చరవినుతమహానుభావుండగు బుచ్చిరాజును సంభవించిరందు,

చ. శరణనివచ్చువారలకు సత్కృపతో నభయంబొసంగు సం
కర మొనరించు వైరులనుఖడ్గముపాలుగఁజేసి శూరతన్
సరసులుగాని భూపతులజాడలు మెచ్చఁడు నత్సవాయశ్రీ
తిరుపతిరాజశేఖరుఁడు దేవసమానుఁడు సద్గుణోన్నతిన్.

సీ. పద్ధతిఁదప్పి దబ్బరమాటలాడఁడు
చెడుగులదనచెంత జేరనీఁడు
నీతివర్జితులైన నగడినదొరలతో
గాసిచేయఁడు మైత్రిఖలులతోడ
ననిలోనజోఁగని మొనకాండ్రనే కాని
కొలువుంచనొల్లఁడు కుటిలమతుల
నడుగుటకన్న నెక్కుడుధనంబే కాని
కొంచెమియ్యఁడు యాచకులకునెల్ల
నెంతఘనుఁ డెంతసజ్జనుఁ డెంతశూరుఁ
డెంతవితరణియని రాజులెన్న మెచ్చ
వత్సవయ వెంకటక్షితివరవినుతుఁడు
ప్రకటగుణశాలి తిరుపతిరాయమౌళి.

చ. శరనిధిమేఱఁదప్పినను జంద్రుని చల్లదనంబుదప్పినన్
హరునివరంబుదప్పినను హాటకగర్భుని వ్రాఁతతప్పినన్
సురపతిప్రాలుదప్పినను సొంపువహించిన వత్సవాయ శ్రీ
తిరుపతిరాజశేఖరుని తిన్ననివాక్యముతప్పదెప్పుడున్.

మ. ఫలభూజంబులు దేవతాభవనముల్పానీయశాలావళుల్
విలసత్పూర్ణతటాకకూపవితతుల్ విప్రప్రతిష్ఠాదిని
ర్మలధర్మంబులుసేయుచున్ప్రజలసంరక్షింపుచున్ హెచ్చెని
శ్చలభాగ్యోన్నతిఁగాంచెశ్రీతిరుపతిక్ష్మానాయకుండెంతయున్.

క. గంగాతరంగహారిమా
తంగతురంగమభుజంగధరపుంగవసా
రంగాదులఁ బ్రహసించున్
మంగలగిరిరాజుకీర్తి మానితరుచులన్.

మ. ఇదిగో హెచ్చుగవత్సవాయకులజుండేకాంగవీరుండుదా
గదనక్షోణికివచ్చె జగధరణీకాంతుండు భేరీరవం
బిదిగో కర్ణకఠోరమై నెగడెదిక్కెల్లనంచు విభ్రాంతులై
పదముల్ద్రొట్టిలఁబారి మేతురునిజప్రాణార్థులై శాత్రవుల్.

ఉ. సారవిహారి వత్సవయ జగ్గనృపాలుని పేరువిన్న చో
వైరినరేంద్రయోధు లనివారితభూరిభయాబ్ధిమగ్నులై
వారకతల్లడింతురట వారిగజంబులు వారిగుఱ్ఱముల్
నీరునుమేఁతనొల్లవఁట నిద్రయులేదఁని వానికయ్యెడన్.

ఉ. మాన్యములిచ్చువిప్రులకు మత్తిలివచ్చినశత్రుకోటిదా
ర్జన్యమునిగ్రహించు గురుసజ్జన బాంధవులందుఁజాల సౌ

జన్యమువిస్తరించుసరసత్వము సత్వముగల్గు రాజమూ
ర్ధన్యుఁడు రాజమాన్యుఁడు వదాన్యుఁడు జగ్గనృపాలుఁడిద్ధరన్.

ఉత్సాహావృత్తము.

సంగరాంగణమున సవ్యసవ్యసాచియనికళిం
గాంగవంగమగధమాళవాదిదేశపతిసభా
రంగములజనులునుతించఁ బ్రభవహించె నైరిసా
రంగసింహరాజు సింగరాజురాజమాత్రుఁడే.

చ. నలునకుసాటి రూపున ధనంజయుసాటి పరాక్రమంబునన్
గలువలరేనిసాటి మృదుకాంతిని గర్ణునిసాటి యీవిచే
బలరిపుసాటిభోగమునఁ బార్థివరత్నము వత్సవాయిస
త్కులజుఁడు పేరభూరమణకుంజరుఁడెన్నికకెక్కెనన్నిటన్.

ఉ. బటువులు మేలుచౌకటులు పచ్చలపోగులు చంద్రహారముల్
గటకకిరీటవజ్రపతక ప్రముఖాభరణంబులుంబరి
స్ఫుటరుచిహేమచేలములుఁ బూనఁగ నేర్చి ననుందరాంగువేం
కటనృపుపేరభూవరుని గన్గొనఁగావలె వేయుగన్నులన్.

ఉ. కంటకులైన శాత్రవుల గర్వము సర్వము గ్రుంగజేసి ము
క్కంటిగళంబుపై నలుపుఁ గప్పఁగజాలిన శుభ్రకీర్తిచే
నింటికిఁ బేరుదెచ్చి కడు హెచ్చినధన్యుడు బుచ్చిరాజు తాఁ
గంటికి రెప్పచందమునఁ గాచుగదా ప్రజలనెల్ల వేళలన్

వ. ఏవంవిధబహుగుణప్రథితచరిత్రుఁడైన వెంకటధాత్రీశ్వరుని
పుత్రులు చక్రవర్తులకరణిఁ బుణ్యమూర్తులగుచుఁ గీర్తిగాం
చిరందు.

గీ. సుగుణబలశాలికిఁదిరుపతిక్షోణిపతికి
సంభవించిరిసుతులు విస్తృందప్రమతులు
ఘనులువెంకటపతియు మంగళగిరిప్ర
భుండుసింగన్నయును బుచ్చిభూపతియును.

క. ఆయుష్మంతుడు విప్రవి
ధేయుఁడుగనకాచలేంద్రధీరుఁడువిమతా
జేయుఁడు వెంకటపతిభూ
నాయకుఁడభివృద్ధిఁజెందునరపతులెన్నన్.

క. మంగళగిరి నృపుడలమే
ల్మంగాకరుణా కటాక్షమహిమ ప్రాప్తిన్
రంగత్తురంగమదమా
తంగమహారాజ్య సంపదలవర్ధిల్లున్.

గీ. సింగరాజు ధనాఢ్యుడై చిత్రరత్న
భూషణాంబర ధారియై భోగసౌఖ్య
పుత్రపౌత్ర సమేతుఁడై పూర్ణవిభవ
భాగ్యములుగల్గివర్ధిల్లుఁ బ్రాభవమున

క. వినయము విద్యయుబుద్ధియు
ఘననీతియు గృపయు సత్ప్రఁగలిమియుబలముల్
నెనరును గలిగినయశోవ
ర్ధనుఁడైవర్ధిల్లు బుచ్చిరాజునిరూఢిన్.

గీ. బొజ్జవెంకన్నగారికిఁ బుత్రుఁడైన
ఘనుడు వెంకటపతిరాజు. కాంతిరాజు

భోగమున రాజు విద్యచే భోజరాజు
చారుగాంభీర్యగుణముచే జలధిరాజు.

గీ. ఎన్నదగినట్టి బొజ్జ వెంకన్నగారి
తమ్ముఁడగు కృష్ణనృపతికిఁ దనయుఁడగుచు
బుచ్చిరాజు జనించెనా బుచ్చిరాజు
తోడ నేపుట్టె సకలసద్గుణగణంబు.

చ. వసుచరితాది పూర్వకవివర్యవినిర్మితకావ్యమాధురీ
రసగుణభారతత్వము కరస్థితధాత్రిఫలంబుగా వడిన్
బోనఁగ నెఱుంగునే రసికపుంగవుఁ డట్టివిశేష శేముషీ
లసితుని బుచ్చిరాజును గళాకుశలుల్ వినుతింపఁ జెల్లదే.

మ. సదయస్వాంతులు బుచ్చిరాజమణికిన్ జన్మించి రాత్మోద్భవుల్
పెదతమ్మయ్యయుఁ గృష్ణభూపతియు గంభీరుండు జగ్గయ్యయున్
సుదతీమన్మథుఁడైన శ్రీతిరుపతిక్షోణీశ్వరుండున్నగ
ద్విదితుండౌ పెరుమాళ్ళరాజును మహాధీశుల్ సుధీరక్షకుల్.

వ. అందు.

ఉ. ధారుణి వత్సవాయి పెదతిమ్మనృపాలుఁడు వారిరాశిగం
భీరుఁడు మేరుధీరుఁడు సమిజ్జయవిక్రమశూరుఁ డూర్జితా
చారుఁడు ధర్మనిర్మల విచారుఁడు భాసురశుభ్రకీర్తివి
స్తారుఁడు యాచకాభిమత దానవిహారుఁడు రాజమాత్రుఁడే.

ఉ. ఆతని కూర్మితమ్ముఁ డభియాతినృపాతత గర్వపర్వత
వ్రాతవిభూతి శాతతరవారిశతారుఁడు పారిజాతజీ

మోతదధీచిఖేచర సమున్నతదానకళావిలాసవి
ఖ్యాతుఁడు కృష్ణభూవరశిఖామణివార్తకు నెక్కెదిక్కులన్.

ఉ. గోవులఁగాచి గోపికలఁగూడిరమించి జగంబువారు మా
యావియనంగ వర్తిలినయాదవకృష్ణుని కన్నమిన్న వి
ప్రావళినెల్లఁబ్రోచి నియమాన్వితుఁడై ప్రియసత్యభాషియై
శ్రీవిలసిల్లువత్సవయకృష్ణనృపాలుఁడు సద్గుణోన్నతిన్.

ఉ. రచ్చకువచ్చి శ్రీవిజయరామనరేంద్రుఁడు చేతఁబట్టి తా
నిచ్చిన హాటకాంబర సమీహిత ఘోటకభూషణావళుల్
హెచ్చినవేడ్కతోడనుకవీంద్రులకున్ బహుమానయుక్తిగా
నిచ్చులమేటి వత్సవయకృష్ణనృపాలుఁడు రాజమాత్రుఁడే.

క. ఆకృష్ణనృపతితమ్ముఁడు
శ్రీకరుఁడగు జగ్గరాజు సింహముకరులన్
ఢీకొని భేదించుగతిన్
బ్రాకడరిపుసైన్య పతులబరిమార్చువడిన్.

క. ఆజగ్గరాజు తమ్ముని
తేజోబలవిజిత సకలదేశాధీశున్
భూజనసమ్మతుఁ దిరుపతి
రాజేంద్రునిమెచ్చవచ్చు రామునికరణిన్.

క. శ్రీకరగుణరత్నాకరు
భీకరకరవాల రాహుపీడితసకలం
కాకార రాజమండలు
ధీకలితుని బొగడఁదరమె తిరుపతినృపతిన్.

గీ. అట్టితిరుపతినృపుతమ్ముఁడైనఘనుని
ధీరుఁ బెరుమాళ్ళ భూపుని దివ్యతేజు
జూచియాచించువారికి. సులభముగ ల
భించుసన్నంబు షడ్రసోపేతమగుచు.

వ. ఇమ్మహాత్ముల సంతతివర్ణించెద.

మ. పెదతమ్మయ్యకు సంభవించిరిగుణోపేతుల్ సుతుల్ కామినీ
మదనుండౌచినరాజశౌరియును శ్రీమంతుండులత్సయ్యయున్
సదయస్వాంతుఁడు వెంకటప్రభువు విశ్వాసార్హచారిత్రుల
భ్యుదితాప్రతిమానతేజులుజగత్ప్రాజ్యుల్ యశోవర్ధనుల్

చ. స్తుతమహనీయమూర్తులు సుతుల్జనియించిరి కృష్ణశౌరికిన్
రతిపతిసుందరుండు పెదరాజయచంద్రుఁడు సద్గుణైక భూ
షితుఁడగు జగ్గరాజనృపశేఖరుఁడౌ రమణావనీశుఁడున్
క్షితిసురరక్షణార్థము సృజించెఁగదా పరమేష్ఠివారలన్.

క. తిరుపతిరాజు కుమారుఁడు
సరసుఁడు చండప్రచండ సాహసపరతుం
డరికరికేసరిబిరుద
స్ఫురితుండై జగ్గరాజుసొంపువహించెన్.

గీ. రాజమాన్యులు పెరుమాళ్ళరాజసుతులు
బుచ్చిరాజును దిరుపతి భూమిపతియు
దేజమున సూర్యచంద్రులతీరువారు
వార్తకెక్కిరి సకలభూవరులసభల.

వ. ఇవ్విధంబున మంగళగిరిరాజు, బొజ్జ వెంకటరాజు, కృష్ణభూపాలురసంతతి విస్తరిల్లుచుండె. ఇఁటమీఁదఁ జినప్పల క్షోణీకాంతుని సంతతి వర్ణించెద.

ఉ. అంబుజనాభతుల్యుఁడు చినప్పలరాజపురందరుండు దు
గ్ధాంబుధికన్యబోలిన మహానుచరిత్రమలచ్చమాంబ నం
దంబుగ బెండ్లియై ఘనవదాన్యులఁబుత్రులఁగాంచె రాజ్యభా
రంబు వహించుజగ్గనృపు రమ్యగుణాకరు రాయభూవరున్.

వ. అందు.

చ. ఘనుఁడతఁడెంత దాతలకుకవ్వడి యెంతరణప్రచండుఁడా
మనసిజుఁడెంతసుందరుఁడుమన్మథశాసనుఁడెంతధ్వనియా
ధనపతియెంతవిత్తనిధి దానవినోది చినప్పలయ్య నం
దనునిమహానుభావు నతిధార్మికు జగ్గనృపాలునెన్నచోన్.

ఉ. రాయపరాయచంద్రుఁడుధరాయువతీప్రియవరుండు గాం
గేయసమాన విక్రముఁడు కీర్తివితానసితాభ్రలిప్తది
జ్ఞాయకనాయికా జనఘనస్తన మండలుఁడభ్రనిమ్నగా
తోయవినిర్మలాత్ముఁడతిదోర్బలశాలినుతింపఁగాదగున్.

ఉ. శ్రీవరిపూర్ణు లార్యనుతశీలురు జగ్గనృపాలునందనుల్
భూపతులెన్న వైభవముఁబూనిరి శ్రీనరసింహుఁడున్ జగ
ద్వ్యాపకకీర్తియప్పల నరాధిపుఁడున్ బుధకల్పశాఖల
క్ష్మీపతిరాజచంద్రుఁడును సింధుపరీత మహీతలంబునన్.

క. అందు నరసింహనృపతికి
నందనులుదయించి సజ్జనప్రియులై పే

రొందిరి జోగిన్నృపుఁడు గో
విందకృపాపాత్రుఁడైన వెంకటపతియున్.

వ. ఆజోగిరాజునకు సనమానశౌర్యసంపన్నుండు నర
సరాజును, బచ్చవిల్లునికన్నఁ బ్రిన్నదనంబున నెన్నఁదగిన
లచ్చి రాజును, భీమసంగ్రామసముద్దామస్థేమవిశాలుండు రా
మభూపాలుండును, నెమ్మనమ్ములం దనవాక్యమ్ములిమ్ముగా
నమ్మిన జనమ్ముల నెమ్మింబ్రోచు తిమ్మరాజును, వైష్ణవా
రాధనవర్ధిష్ణుండు కృష్ణనరనాథుఁడును సంభవించి,పాంచజన్య
ధరుని పంచాయుధంబులకరణిఁ బ్రపంచరక్షణోద్యోగంబు
నందు వర్తించిరి. అందగ్రజుండగు నరసనరనాథునకు నిశ్శంక
బిరుదాంకితుండైన వెంకటప్రభుండు ప్రభవించె. లచ్చభూ
పతికి సర్వసర్వంసహాధూర్వహుండైన సర్వనృపాలుండుదయిం
చె. రామభూమీశ్వరునకు సముదీర్ణవితరణకర్ణుండైన కర్ణ
ధరణీకాంతుండు జనియించె. తిమ్మరాజేంద్రునకు హరిహర
హిరణ్యగర్భులకెనయైన బాపిరాజ, జోగిరాజ, వెంకటరాజు
లు ప్రాదుర్భవించిరి. కృష్ణమనుజాధీశ్వరునకు నిరాతంక నిరం
కుశనిష్కళంక చరిత్రుఁడైన వెంకటపతిధరిత్రీకళత్రుండవత
రించెనంత.

గీ. రాజపూజితుఁడగు జోగిరాజుతమ్ముఁ
డైన వెంకయ్యకు జనించిరాత్మభవులు
భాగ్యవంతులు వెంకటపతియు రామ
కృష్ణుఁడును విష్ణుకృపను వర్ధిష్ణులైరి.

గీ. అందు వెంకటపతిరాజ నందనుండు
ఘనుఁడు రామయ్య లోకవిఖ్యాతిగాంచె
నతతివర్తితమును గర్హనివర్తితమునొక్క
తీరుదనిధీరజనులు నుతింతురెలమి

సీ. రామకృష్ణక్షోణిరమణునిపుత్రులు
ధరవినిశ్చలబుద్ధి తమ్మిరాజు
నరసాగ్రిగణ్యుండు జగ్గభూపాలుండు
రమణీయమూర్తి యౌ రాజనృపతి
బలశాలి వెంకటపతిమానవేంద్రుండు
క్రూరవైరివిదారి గోపశౌరి
గురుభక్తినిపుణుఁడు దిరుపతిస్వామిభక్త
కరుణాంబునిధి రామధరణివిభుఁడు
సప్తకులశైలధీరులు సప్తజలధి
సదృశగంభీరహృదయులు సాధుహితులు
బంధుజన సమ్మతులు విపక్షధరణచతురు
లగుచు విఖ్యాతిఁ గాంచిరి జగతియందు.

గీ. వత్సవాయచినప్పలవసుమతీశు
తనయుఁడగు జగ్గనృపతికిఁ దనయుఁడైన
యప్పలయ్యకుమారులు మెప్పుగనిరి
పద్మనాభుండు వెంకటపతిభువరుండు.

గీ. పద్మనాభునిపుత్రులు భాగ్యనిధులు
నరసనృపమాలియప్పలధరణివిభుఁడు

జగ్గరాజును బెరుమాళ్ళు సకలబంధు
జనులపాలింటి కల్పవృక్షములు వారు.

వ. అందు.

ఉ. సన్నుతకీర్తియప్పనృపచంద్రునిపుత్రులు ధైర్యశాలిసీ
తన్నయు వెంకటక్షితిపుఁడాశ్రితసేవధిపద్మనాభుఁడు
న్యన్నయభూమణుండునరసన్నయు వేదసమానమూర్తులై
వన్నెయువాసియుంగలిగి వార్తకునెక్కిరి భాగ్యసంపదన్.

గీ. జగ్గరాజమణికి సత్పుణ్యశాలికిఁ
బద్మనాభరాజు ప్రభవమొందె
పేరుఁబెంపుగల్గి పెరుమాళ్ళరాజ
పుత్రుండు వెంకటప్రభుండు వెలసె.

క. ఘనుఁడగు నీవెంకన్నకుఁ
బిన తాతయనంగ మిగుల పేరెన్నికఁగాం
చిన వెంకటనృపతికిఁ
దనయుండగు బుచ్చిరాజు తద్దయుఁదనరెన్.

గీ. బుచ్చిరాజేంద్రునకు జోగిభూపతియును
దిరిపతియు వెంకటపతి ధాత్రివిభుఁడు
సుతులు ముగ్గురు పుట్టిరి సుకృతయుతులు
వారిసౌజన్యమెన్నఁగా వశముగాదు.

వ. ఇటమీఁద జినప్పలరాజేంద్రుని ప్రథమపుత్రుండగు జగ్గ

భూపాలుని తృతీయకుమారుండైన లక్ష్మీపతిమహీవల్ల
భుని సంతతి క్రమంబు వర్ణించెద.

క. సుతుఁడుద్భవించెలక్ష్మీ
పతిరాజేంద్రునకు రాయపప్రభురత్నం
బతనికిఁ బుట్టిరిలక్ష్మీ
పతిరాజునుగృష్ణనృపుఁడు బహుధర్మాత్ముల్.

క. లక్ష్మీపతిరాజ సుతుల్
సూక్ష్మమతుల్ తిరుపతియును శుభగుణలక్ష్మీ
లక్షుఁడు జగ్గయ్యయు సక
లక్ష్మాపతిపూజ్యులధికలావణ్యనిధుల్.

వ. తిరుపతిభూపాలునకుఁ దిరుపతి వెంకటేశ్వర వరప్రసాదం
బున విశంకటనిరాంతకశుభ విభవుండగు వెంకటమనుజేం
ద్రుండుబుట్టె. ఇటమీఁద జినప్పలజగతిమండలేశ్వరునకు
రెండవ పుత్రుండైన రాయపనరాధిపతి సంతతివర్ణించెద.

సీ. రాయపధారుణీరమణేంద్రునకుఁ బుట్టె
నప్పలనరనాథుఁడనఁగ సుతుఁడు
ఘనుఁడానృపాలునితనయుండు రాయప
ప్రభుఁడాయనకు దిమ్మరాజుపుట్టె
నమ్మహాత్ముని పుత్రులధికశూరులుజగ్గ
రాజు రాయపరాజు రాఘవుండు
వరసమున్నతకీర్తి నరసరాజును జిస
రాఘవుండును గుణరత్ననిధులఁ

వార్త కెక్కిరి వంశపావనులనఁగ
వసుధనిటువలె శ్రీవత్సవాయతిప్ప
రాజసుతుఁడైన శ్రీజగ్గరాజచంద్రు
వంశము భివర్ధమానమై వన్నెఁగాంచె.

సీ. తేజమువీఱ వత్సవయ తిప్పమహీశుని సింగరాజు ఘో
రాజిని కుండలీకృతశరాసనుడై శరవృష్టి విద్విష
ద్రాజగణంబుపై గురియఁ దామరచూలియుఁ గుండలించుస
వ్యాజవిరోధిఫాలలిఖితాయతజీవితవర్ణపఙ్క్తులన్.

చ. ఘనతరకీర్తి సింగమహికాంత శిరోమణికిన్ సమస్తస
జ్జనవినుత ప్రభావగుణశాలిని యౌ తగు కృష్ణమాంబకున్
దనయులు సంభవించిరి నితాంతవదాన్యుఁడు గోరుకొండరా
జు నుపవిజయోపమాన రణశూరుఁడు జగ్గనృపాలచంద్రుఁడున్.

వ. అందు.

ఉ. అవ్వనజారిమౌళినిలయంబగు కొండసమంబు కీర్తికిన్
గవ్వఁపుఁగొండ సాటి రిపుకాండపయోధిమథించుశక్తికిన్
మవ్వపుఁబైఁడికొండ యుపమానము రత్నసమృద్ధికన్యులే
డెవ్వరు కోరుకొండ మనుజేంద్రుని సద్గుణయుక్తికిమ్మహిన్

చ. సిరిగలవాఁడనంచుఁ దనచేసిన శాసనలేఖ భూపతుల్
శిరములఁబూనిరంచు ధనసేవధిపూర్ణతరంబు లాత్మమం
దిరములటంచు గర్వము మదిం జొరనీయఁడు సింగ ధారుణీ
శ్వరునిసుతుండు వత్సవయజగ్గనృపాలుఁడు ధన్యుఁడేకదా.

వ. అందు.

మత్తకోకిల.

కోరుకొండనృపాల శౌరికిఁ గూరవైరివిదారికిన్
ధారుణీజనగణ్య పుణ్యకదంబ యానరసాంబకున్
భూరికీర్తులు ధర్మమూర్తులు బుట్టిరిద్దఱు నందనుల్
వీరసింహులు సింగరాజును వెంకటాద్రిన రేంద్రుడున్.

వ. అందు.

క. సింగనరపుంగవునకు ర
మాంగన కెనయైన వెంకమాంబకుఁ దనయుల్
సంగరవిజయులు సదయుల
నంగలిగిరి వెంకటాద్రి నరసింహనృపుల్.

చ. అనఘులు వెంకటాద్రికి దయాంబునిధుల్ జనియించి రాత్మజుల్
సనయులు గోరుకొండమనుజప్రభుఁడున్ గుటిలారిగర్వభం
జనుఁడగు సింగభూపతియు శారదనీరదనారదస్ఫుర
ద్ఘనయశుఁడై నరసింగమహీకాంతుఁడు విశ్రుతిగాంచిరిమ్మహిన్.

వ. అందు

మత్తకోకిల.

న్యాయశీలుఁడు సింగశౌరికినందనుండుదయించె నా
రాయణాంశము సన్మహీజనరక్షణార్థము వీరనా
రాయణప్రభుఁడాశ్రితద్విజరాజపోషకుఁడుగ్రకా
క్షేయకప్రహతారి సైన్యుఁడు శ్రీసమంచితరాముఁడై.

వెంకటాద్రిదికేఁ దమ్ముఁడై విదితుఁడై స
నారసింహుని పుత్రులు ధీరమతులు
రామభద్రుఁడు వెంకటరాజనంగ
ఖ్యాతిఁగాంచిరి రామలక్ష్మణులరీతి.

. ఆరామభద్రనృపతికి
శ్రీరాములకరుణచేఁ బ్రసిద్ధులుపుత్రుల్
ధీరులుగలిగిరి జగ్గ
క్ష్మారమణుఁడు నరసరాజునరసాగ్రసరుల్

. ఆజగ్గరాజుగారికి
తేజోనిధిరామరాజు ధీరుఁడుపుత్రుం
డై జనములు వినుతింపఁగ
రాజై సిరిగాంచె సకలరాజులుమెచ్చన్.

. నరసమానపరాక్రమస్ఫురణగల్గు
నరసనృపతికి వెంకటేశ్వరులకరుణ
సంభవించిరి పుత్రులు జగ్గరాజ
చంద్రుఁడును జోగిరాజును చతురమతులు.

ఉ. అక్షరపక్షపాతము సమంచితమంత్రవిచారరూఢియున్
దక్షతయున్ బ్రతాపమును ధైర్యము శౌర్యము ప్రజా
రక్షణశీలమున్ సమరరంగజయంబును గల్గుమేటి వ
ద్యక్షుఁడు వత్సవాయ నరసాధిపుజగ్గనృపాలుఁ డెన్నగాన్.

చ. కయ్యముఁ గెల్వ నేరుపునఁగవ్వడితో సరివచ్చు జోడయా
తియ్యనివింటి యొంటరికి దీటనఁజాలినసుందరుండయా

నెయ్యులకున్ విధానముయి నీతివహించిన వత్సవాయజ
గ్గయ్యనృపాలుఁడద్భుతగుణాఢ్యుఁడయా నృపకోటిలోపలన్.

గీ. అతనితమ్ముఁడు ధైర్యహేమాద్రిరాజు
జోగిరాజుప్రకాశించె సుజనహితుఁడు
తద్గుణంబులు లెక్కింపఁదరముగాదె
నాల్గుమోములుగలిగిన నలువకైన.

క. ఘనుఁడగు జగ్గనృపాలుని
తనయులు వర్ధిల్లి రధికదాతలుగులపా
వనుఁడగు వెంకటపతియును
జనసమ్మతుఁడైన నరసజననాథుండున్.

వ. ఇది కోరుకొండ భూమండలేంద్రుని సంతతిక్రమంబు. ఇటమీఁద జగ్గరాజచంద్రుని సంతతిక్రమంబు వర్ణించెద.

గీ. కోరుకొండ మహారాజుకూర్మి తమ్ముఁ
డైన జగ్గవసుంధరాధ్యక్షునకును
రంగమాంబకుఁబుత్రుఁడై రాజ్యమేలె
నవ్యసురరాజు శ్రీగోపినాథరాజు.

చ. గజతురగాద్యసంఖ్యబల గర్వితచిత్తులమిత్త్రవైరిభూ
భుజులమహాజిలోదునిమి భూరిజయాభ్యుదయాభిరాముడై
గజపతిచేతఁగానుకలుగైకొనియెన్ మణిభూషణాంబర
వ్రజములుగోపినాథనృపవర్యుఁడవార్యపరాక్రమోన్నతిన్.

మ. అతిశూరుండగు గోపినాథ నృపుఁడశ్వారూఢుఁడై భండన
క్షితినుద్దండతమండలాగ్రము వడింజేబూనవిద్వేషి భూ

పతి రంభానలకూబరాంగనలకున్ భావ్యర్థసంసూచనో
ద్యతమై వామవిలోచనంబు గనలున్ దత్పౌరుషం బెట్టిదో.

మ. వినయం బీతనిభూషణంబు త్రిజగద్విఖ్యాత దాతృత్వమీ
తనితోఁ బుట్టువు సత్యవిక్రమ దయాదాక్షిణ్యధైర్యంబు లీ
తని చుట్టంబులు సద్యశంబితని విత్తం బంచు వర్ణించు స
జ్జనసంఘంబులు గోపినాథనృపమూర్ధన్యున్మహాధన్యునిన్.

క. రామునకు సీతవలె గుణ
ధామునకున్గోపినాథధాత్రీరమణ
గ్రామణికి రాణియై సా
ధ్వీమణియగు నాగమాంబ తేజము నెరపెన్.

సీ. ఆనాగమాంబామహాదేవికిసిగోపి
నాథభూమండలనాయకునకు
శౌరిచతుర్భుజచతురంశమున సం
భవించిరిపుత్రులువిశ్వహితులు
దేశమాన్యుండును జగ్గభూపుండును
విష్ణుతుల్యుఁడు చినవెంకటపతి
గాంభీర్యజలధి వేంకటకృష్ణభూపతి
మేరుధీరుండు గస్తూరిరాజు
ధరణిపాలించిరమరేంద్రధర్మరాజ
వరుణధననాథసములుదుర్వారవిభవ
సుకృతకరుణార్ధశోభితుల్ సురవరేభ
వామనాంజనరజసార్వభౌమనిభులు.

వ. అందు.

ఉ. నీతికిఁబట్టుఁగొమ్మధరణీసురభక్తికిమందిరం బుధ
ఖ్యాతికిజన్మభూమిశరణార్థిజనాళికివజ్రపంజరం
బాతతరాజ్యలక్ష్మికివిహారవ నంబితఁడంచుభూపతి
వ్రాతము లెన్నజగ్గనృపవర్యుఁడు హెచ్చినిరూఢసంపదన్.

సీ. వసుధకువచ్చి యెవ్వరికైన వాంఛితం
బిచ్చెనాసురభూజమింతనిసాటి
ఘనభావమొప్ప బంగరువానగురియంగ
నేర్చెనా మేఘుఁడీనృపునిసాటి
యమరులకుభయపక్షములందు నొసఁగెనా
చంద్రుఁడీధారుణీశ్వరునిసాటి
మథితుండుగాకసమ్మతితోడనిడియెనా
కలశాబ్ధియీగుణాకరునిసాటి
కాకభూజనఫలదుఁడై కలిత కనక
వర్షమైనిత్యవితరణవర్తియగుచు
సమ్మదంబుననొసఁగు వత్సాహయుజగ్గ
వసుమతీపతికెనవచ్చువా రెవారు.

క. చినవెంకటపతిభూపతి
ఘనుఁడనగావిప్రతతికి ఘనముగవర్షా
శనములొసంగుచు ధాత్రీ
జనులఁగడుంబ్రోదిచేసెశరణంబగుచున్.

ఉ. యాత్రికుఁ బోవు వారికి సమస్తసువస్తుచయంబొసంగుస
త్పాత్రులకిచ్చు దానములు బ్రాహ్మణపూజలొనర్చు మాధవ
స్తోత్రము జేయుని చ్చలుమనుస్థిరమానసపూజితాత్మమూ
ర్తి త్రియుండు వెంకటపతిక్షితినాథుఁడు ధన్యుఁడెన్నఁగన్.

మ. హరినామస్మరణంబు జిహ్వకు ముకుందాంఘ్రిద్వయధ్యానసు
స్థిరభావంబు నిజాంతరంగమునకున్ శ్రీనారసింహార్చ స
త్కారపద్మంబులకున్ విభూషణముగా ధన్యాత్ముఁడై విష్ణుత
త్పరుఁడై వేంకటకృష్ణరాజు ప్రబలెన్ బ్రహ్లాదుచందంబునన్.

సీ. వేదాంతవేద్యుండు విష్ణుఁడే పరతత్వ
మనినిశ్చయించిన యనఘమూర్తి
చూడ సర్వంచ విష్ణుమయం జగత్తని
విజ్ఞానయుక్తి భావించుఘనుని
వరభక్తితో నదైవం కేశవాత్పరం
బనియనన్యభజన సేయని మహాత్మ
ముక్తపరాంకుశప్రోక్తగాథాసుధా
నుభవంబుగల్గిన శుభచరిత్రు
వీరవైష్ణవసత్కథాచారనిరతు
సంతతద్వయమంత్రనిశాంతవదను
వత్సవయగోపినాథభూవరకుమారు
నృపులు మెత్తురు వెంకటకృష్ణఘనుని.

మ. హరియే దైవము విష్ణుఁడే పరతరుండంభోజపత్రాక్షుఁడే
పరమధ్యేయుఁడు గృష్ణభక్తులె మహాపాత్రుల్లగన్మాధవం

స్మరణం బేభవభేషజంబు గురుఁడే చక్రాయుధుండం చుఁద
ద్వరతన్వేంకటకృష్ణధీరుఁ డనుసంధానంబు సేయున్మదిన్.

వ. అతనిసోదరుండు.

సీ. శ్రీపుట్టకొండలక్ష్మీనృసింహులకుఁ బ్రా
సాదంబుఁ గట్టించె శాశ్వతముగ
రాఘిగాలింగేశ్వరునకు మంటపములు
విరచించె బిరుదాంకపురమునందు
దాని చెంగట విప్రతతికగ్రహారంబు
దన పేరఁ గావించి జనులఁ గూర్చె
నచ్చోటఁ బూర్ణతోయంబగు లింగాల
చెఱువు ద్రవ్వించె నచ్చెరువుగాఁగ
వరసగొల్లలమామిడాడ చెంతఁ
జాతవనములు నిల్పె విఖ్యాతి మీఱ
వత్సవయగోపినాథభూవరునిసుతుఁడు
రమ్యగుణహారి కస్తూరిరంగ శౌరి.

చ. ఇనజునికన్న మేటి దివిజేంద్రునికన్నను బెద్ద పార్వతీ
తనయునికన్న జాణ ధనదప్రియమిత్రునికన్నఁ బ్రోడ స
జ్జననుతదానభోగపటుశౌర్యవిభూతిగుణప్రసిద్ధిచే
ఘనతరకీర్తి వత్సవయకస్తురిరంగనృపాలుఁ డిమ్మహిన్.

వ. ఇందు గృతిపతివంశవర్ణనానురూపంబుగా జగ్గరాజే

క. చినవెంకటపతిభూపా
లునిపుత్రుండు పద్మరాజులోకస్తోత్రరుచిరుండై
వినయము విద్యయు బుద్ధియు
ధనధాన్యసమృద్ధి గలిగి తద్దయుం బ్రబలెన్.

వ. ఆపద్మరాజునకుం బరమపవిత్రచరిత్రులు సలుగ పుత్రులుద్భవించిరి.

సీ. నరసింహాచరణాబ్జపరిపూజనాసక్త
నరసాంతరంగుండు నరసరాజు
కుటిలచిత్తారాతిభటగర్వజీమూత
పటునమీరుండు వెంకటవిభుండు
నిచ్చ వేఁడినయర్థికిచ్చుతలంపుచే
హెచ్చిననెరదాత లచ్చిరాజు
రామదేవసహస్రనామపారాయణో
ద్ధామనిష్టాశాలి రామరాజు
కొమరుమిగులగు గాంభీర్యగుణముచేత
వారిరాసులతో సరివచ్చువారు
చతురుపాయప్రవీణులు సాధువిప్ర
రక్షకు లనంగఁ బ్రబలిరి రాజమణులు.

చ. నరసనృపాలునందనులునల్గురు హెచ్చిరివైరిరాడ్భ
కరుఁడగు లచ్చిరాజు బుధకల్పమహీజము వీరరా
క్షరుఁడగు లచ్చిరాజుబుధకల్పమహీజము వీరరా
ద్వీరచితరక్షణవ్రతుఁడు వెంకటరాజును ధర్మకా
స్థిరుఁడగుపద్మరాజును విచిత్రపవిత్రచరిత్రులెం

ర్యాతిశయశాలి జగ్గమ
హీతలపతి సకలసుజనహితుఁడై పెంచెన్.

గీ. అందు రామనృపాల పురందరునకు
సుతుఁడు వెంకటపతి మహీపతిజనించె
నాయురారోగ్యవిభవ సౌఖ్యాభివృద్ధి
గలిగివర్ధిలు రఘురాముకరుణచేత.

వ. ఇది లచ్చిరాజు సంతతిక్రమంబు.

క. పేరమహీనాథునకుఁ గు
మారుఁడు జన్మించె రాజమాన్యుండతి గం
భీరుండు తమ్మిరాజు ము
రారికృపాదృష్టివలననధికుండయ్యెన్.

క. ఘనుఁడగు వెంకటనృపతికిఁ
దనయులు కొండ్రాజు నరసధరణీశ్వరుఁడున్
ధనకనక వస్తుచయవా
హనయుతులై వృద్ధిబొంది రైశ్వర్యమునన్.

గీ. పద్మరాజుతనూజులు భాగ్యనిధులు
రమ్యగుణశోభితులు జగ్గరాజు లచ్చి
రాజు బలభద్రి నరసింహరాజులధిక
శూరులనవార్చకెక్కిరి ధీరమతులు.

వ. ఇది నరసరాజు సంతతిక్రమంబు.

క. వెంకటభూపతి సుతుఁడు వి
శంకట నిజకీర్తి విజితశక్రేభకు రం

గాంకుండు లచ్చిరాజు ని
రంకుశ విక్రముఁడు పరిబరి రాజులువొగడన్.

గీ. ఆగుణాఢ్యుని పుత్రుఁడు భోగశాలి
వెంకటపతి క్షితీశుఁడు వినుతిగాంచె
నతనికి జనించె జోగిరాజనఁగసుతుఁడు
బుద్ధివాగ్విభవసర్జిత భోగిరాజు.

గీ. రాజకంరర్పుఁడగు లచ్చిరాజుసుతులు
నెమ్మినమ్మంగఁదగు రాజుతమ్మిరాజు
కోపదర్పార్జితరిపురాజు గోపరాజు
ధీరులై ఖ్యాతి నొందిరి సారభుజులు.

గీ. తమ్మిరాజు కుమారులు ధైర్యనిధులు
భామినీజనరతిరాజు రామరాజు
సరస సంగీతకుశలుండు నరసరాజు
రాజమాన్యుండు వెంకట రాజశౌరి.

ఉ. గోపనృపాలనందనుఁడు కూరిరవిరోధినిరోధకుండు
శ్రీపతిమాననీయుఁడు సుధీగుఁడు క్షత్రియవంశధ
స్థాపనశాలి లక్ష్మనరస ప్రభుఁడాశ్రితవిప్రకోటికి
బ్రాపయి వత్సవాయకులపావనుఁడై విలసిల్లునె

వ. ఇది చినవెంకటపతిరాజు సంతతి. ఇతన్న
సోదరుఁడగు వెంకటకృష్ణభూపాలుని సంతతిక్రమంబుఁ

ఉ. పాలితధారుణీదివిజపాళికి వెంకటకృష్ణభూమిభృ
న్మౌళికి సంభవించిరి సమర్థులుపుత్రులు విష్ణువ

పాలనృపాలుఁడుస్ రిపువిభాలుఁడు కేశవరాయశౌరియున్
శ్రీలలితాంగుఁడై ననరసింహమహీపతియున్మహోన్నతుల్

వ. అంగ్రజుండు.

సీ. నీతిచే సౌజన్యరీతిచే శౌర్య వి
ఖ్యాతిచేనెగడిన ఘనుఁ డితండు
కీర్తిచే సుందరమూర్తిచేఁ గాంతివి
స్ఫూర్తిచేఁదగు మహాపురుషుఁ డితఁడు
శమముచే సంతతోద్యమముచే బాహువి
క్రమముచే విలసిల్లు రాజితండు
ధనముచే ధర్మవర్తనముచే విప్రవం
దనముచేవర్ధిల్లు ధన్యుఁడితఁడు
జయముచేతను వితరణోచ్ఛ్రయముచేత
ధరణిఁ బాలించనేర్చిన నరుఁడితఁడు
వీర వెంకటకృష్ణభూవిభునిసుతుఁడు
రాజమాతుండై గోపాల రాజమౌళి.

క. గోపాలరాజు మాళవ
నేపాళవరాళచోళ నిషధావంతీ
భూపాల పూజ్యుఁడగుచు మ
హీపాలన మాచరించె హెచ్చినమహిమన్.

సీ. తనమహారమ్య సౌందర్యంబు వీక్షించి
వనితలు మకరాంకుఁ డనుచు మెచ్చ

దన బాహువిక్రమోద్ధత వృత్తి దర్శించి
యరిసైనికులు పాఱఁడనుచుఁ బొగడఁ
దనభువనాద్భుతౌదార్యంబు గన్గొని
యాచకుల్ సురభూజ మనుచుఁ బొగడఁ
దన నిశాతకృపాణ ధారఁజూచివిరోధి
జనపతుల్ యమజిహ్వయనుచుఁదొలఁగఁ
దన యశోమండలము గాంచి ధనదసఖుఁడు
వెండికొండ యటంచు భావించిచేర
వత్సవాయాన్వయమునకు వన్నెఁదెచ్చె
రమ్యగుణహారి కేశవ రాయశౌరి.

మ. హరిసేవాపగతంత్రుఁడై గురుపదాబ్జారాధనాసక్తుఁడై
పరకాంతాజనసోదరుండఖరణప్రాగల్భ్యసేనానియై
నరసుండై ధరనేలె వత్సవయవంశశ్రేష్ఠుఁడై కీర్తిభా
సురుఁడై వెంకటకృష్ణధీరునరసక్షోణీశ్వరుండున్నతిన్.

వ. అంత.

క. కృష్ణాంశసంభవుఁడరో
చిష్ణుఁడుగోపాలరాజశేఖరునకువ
రిష్ణుండగుచినవెంకట
కృష్ణుఁడునుతుఁడుద్భవించికీర్తి వహించెన్.

క. కేశవరాయునిపుత్రులు
ధీశాలురుసమరరంగదృఢశౌర్యగుడా

కేశులు వెంకటపతిధా
త్రీశుఁడు శ్రీరంగపతియు హెచ్చిరిమహిమన్.

వ. అందు.

మ. ఫాలాక్షుండెదిరించినన్ రణములోఁ బార్థుండు పైనెత్తినన్
శైలంబుల్విదళించు వేలుపుమహాసంరంభియై వచ్చినన్
లీలన్వారిని లెక్కసేయక విభాళించున్ భుజాసత్వశౌ
ర్యాలంకారుఁడు వీరవేంకటపతిక్ష్మాధీశుఁ డెన్నందగున్.

క. బాలామన్మథుఁడుకృపా
శీలుఁడుగోపాలచరణసేవానిష్ఠా
లోలుఁడు శాత్రవగర్వవి
భాళుఁడు వత్సవయరంగపతిరాజు భళీ.

గీ. పరిభవహించిన కేశవరాయధరణి
పతికి సుతుఁడైన వెంకటపతిన్నపాల
రత్నమునకుజనించె శ్రీరమణరాజు
కలశపాథోనిధికిసుధాకరుఁడువోలె.

ఉ. రూపునమన్మథుండు బలరూఢినిభీముఁడు బాహువిక్రమా
టోపమునంగిరీటియు బటుప్రతిభన్ సురమంత్రియున్నదా
యీపృథివీశుతోడసములింతయు సత్యమటంచుఁబండితుల్
భూపతులెన్నఁగారమణభూవరుఁడున్నతిగాంచె నెంతయున్.

క. కేశవరాయనిసోదరుఁ
డై శాశ్వతధర్మవర్తియగునరసధరి

త్రిశాగ్రిగణ్యునకుఁబ్రి
జ్ఞాశాలురుబుట్టిరాత్మజన్ములుధన్యుల్.

క. ధీరుఁడగు నరసరాజును
వీరజనాగ్రేసరుండు వెంకటపతిధా
త్రీరమణుండునుదృఢదో
స్సారుఁడుసూరనరపతియుసౌభ్రాత్రనిధుల్.

మ. మధువిద్వేషిలసత్పదాంబురుహాయుగ్మధ్యానశుద్ధాత్ముఁడం
బుధిగంభీరుఁడుకుంభినీశ్వరసభాపూజ్యుండురాకాసుధా
నిధిశోభానిభకీర్తిధర్మగుణకౌంతేయాగ్రజుఁడర్కజా
భ్యధికోదారుఁడువత్సవాయ నరసింహాధీశుఁడెన్నంగగున్.

సీ. శ్రీపుట్టకొండలక్ష్మీనరసింహుల దేవ
ళంబుసుధానులిప్తంబుజేసెఁ
దగవెంకటేశ్వరోత్సవవిగ్రహంబులు
నెమ్మినృసింహుసన్నిధినమర్చెఁ
దిరుపతిమొదలైన దివ్యస్థలంబుల
నెలకొన్నవిష్ణుమూర్తులభజించెఁ
బ్రతివాసరంబునదప్పకనారసింహ సం
దర్శనవ్రతమునద్భక్తిసలిపె
వైష్ణవుల బ్రోచెఫలవృక్షవనమునిల్పె
బ్రజలరక్షించెగీర్తిచేఁబరిపాలించె
వత్సవయ నరసక్షితీశ్వరసుతుండు
వేంకటపతిక్షమాభర్తవిమతహర్త.

గీ. అతనితమ్ముఁడుసకలగుణాభిరాము
డగుచుగురుభక్తిభూషణుండగుచు సత్య
వచనధర్మజుఁడగుచుభూవరులువొగడఁ
బరిభవహించెనుసూరపరాజుభువిని.

వ. అందు.

గీ. భాగ్యనిధియైన వెంకటపతినృపాలు
నందనులుతిమ్మరాజును నరసరాజు
బుణ్యుఁడగుతిరుపతిరాజు బుచ్చిరాజు
తాతరివంతులువరిబలిరి సత్యనిధులు.

ఉ. తిమ్మనృపాలశేఖరుఁడు ధార్మికుఁడై నిజబంధుకోటికిన్
సమ్మతుఁడైమహీదివిజసంఘముపాలిఁటికల్పభూజమై
సమ్మదవృత్తితోడగవిచంద్రులకున్బహుమానమొప్పమా
న్యమ్ములొసంగుగోరినపదార్థములిచ్చుమహాద్భుతంబుగన్.

గీ. చెలగిమదహస్తితోఁబోరిగెలువఁజాలు
జిగనుఁగాఁజాలు సింగంపుకొదమనైన
మించికవ్వడినైనసాధించఁజాలు
నరసభూపాలుమహిమ నెన్నంగఁదరమె.

క. వినయము నెరపునువిద్వ
జ్జనములఁగనుఁగొన్నచోట శత్రులచోటన్
ఘనవిక్రమంబు నెరపును
తనయుఁడుతిరుపతినృపాలచంద్రుఁడు భళి రే.

క. అనృతంబులాడఁడెన్నఁడు
మానసునహరిపాదభక్తి మఱువఁడుమాపం
బును శౌర్యముగలధన్యుఁడు
ఘనుఁడనఁగాబుచ్చిరాజుకడునుతికెక్కెన్.

సీ. నలినపత్త్రవిశాల నయనుండు వెంకట
పతిరాజు సజ్జనపక్షపాతి
కోపంబెఱుంగని గుణశోభితుండు ల
క్ష్మీపతిరాజుదిలీపసముఁడు
శరదిందుకాంతిసుందరదరహాసుండు
సరసుండు నరసింహధరణిభర్త
కామినీహృదయాభిరామమూర్తి సుధైర్య
హేమాద్రివెంకట రామశౌరి
ప్రీతిభకలవత్సవయతిమ్మరాజమణికి
సుతులు నలుగురుపుట్టిరి సుజనహితులు
వసుమతీసురవిశ్వాస వర్ధమాన
విభవదీర్ఘాయురున్నతుల్విమలమతులు.

గీ. నందనులుసంభవించిరినరసరాజ
కుంజరునకుమహాత్ములు కుశలనిధులు
కీర్తివంతుడు వెంకటకృష్ణరాజు
రాజమాన్యుండుబలభద్రరాజమౌళి.

గీ. వత్సవయగోపినాథభూవల్లభునకు
కుమారుఁడై కీర్తిగన్నకస్తూరిరంగ

శౌరికిఁ బుత్త్రుఁ డుదయించె సకలభోగ
నవ్యసురరాజు శ్రీజగన్నాథరాజు.

సీ. వైరిభూపాలకవదనాంబుజములకు
జంద్రిక యేమానవేంద్రుకీర్తి
పరిపంథిగంధసింధురములకే రాజు
భేరీరవంబు సింహారవంబు
విమతాధిపతి సైన్యవిపినంబునకుదన
జ్వాలలే ఘనుతీవ్రసాయకములు
దర్పితాహితమేఘతతికి ఝంఝానిల
వేగమే నరనాథు విజయధాటి
యతఁడు నుతికెక్కె సుగుణరత్నౌఘపేటి
విత్తసంతర్పితాశేషవిబుధకోటి
ధర్మసంపద నతని కతండె సాటి
నీతిపరిపాటి శ్రీజగన్నృపకిరీటి.

సీ. పాలతోఁ జలివెల్గురాలతో నలగు
తూలతో మల్లియపూలతోడ
హారులతో ముత్తెంపుసరులతో నమరుల
తరులతో వెలిదమ్మివిరులతో
జరముతో శరదంబుధరముతో వేల్పుటో
గిరముతోఁ గ్రొత్తకప్పురముతోడ
హారునితో నిండుచందురునితో దుగ్ధసా
గరునితో మేచకాంబరునితోడఁ

గలహా మొనరించి విదళించి ఘనతగాంచి
జగతి విహరించు నేరాజు సాంద్రకీర్తి
యతఁడు నుతికెక్కె వత్సవాయాన్వయాబ్ధి
చంద్రుఁడైన జగన్నాథ జనవిభుండు.

సీ. సిరిగల పెద్దాడపురిని వేంకట నాథు
దేవాదిదేవు బ్రతిష్ఠఁ జేసెఁ
తిరుపతి చేయించి తిరునాళ్లఁగావించి
స్వామికి సంతతోత్సవ మొనర్చి
స్మార్త వైష్ణవ పక్షసముబుద్ధి దీపించి
రమణుతో నగ్రహారంబు లిచ్చె
వల్మీకి గిరియందు వరఫలభూజ భా
సురవనంబు రచించి హరికొసంగె
నన్నసత్రంబు వెట్టె నభ్యాగతులకు
నిధి తటాకాదిధర్మముల్ నిలిపెధరణి
రాజమాత్రుండె కస్తూరి రంగశౌరి
నందనుండైన శ్రీజగన్నాథరాజు.

ఉ. హేమనగేంద్ర ధీరుడగు నేనుగలక్ష్మణసత్కవీంద్రుఁడు
ద్దామసుధామయోక్తి వితతంబగునట్లురచించినట్టి తు
ల్యామహిమప్రబంధముగుణాఢ్యులు మెచ్చ్నబరిగ్రహించెబ్రి
జ్ఞామహితుండుజగ్గనృపచంద్రుఁడు శాశ్వతకీర్తి సంధిలన్.

గీ. ధన్యుడైనజగన్నాథ ధరణిపతికి
గుణసముద్రుండు తిరుమలకొండరాజు

తనయుఁడుదయించె ననమానదానఘనుఁడు
భరతుఁడుఁబోలె రక్షించె,బ్రజలనెల్ల
సీ. హరిహర గురుమహీసుర భక్తినిపుణుఁడై
ధార్మికశ్రేష్ఠుఁడై తనరుమేటి
బాంధవాశ్రిత భృత్యపాల నాసక్తుఁడై
వాత్సల్యశాలియై వఱలు ఘనుఁడు
సత్యవాక్యప్రతిష్ఠాపనాచార్యుఁడై
నీతిప్రవీణుఁడై నెగడుజాణ
ధనధాన్యమణి వస్త్ర ధాత్రీప్రదాతయై
విలసిత కీర్తియై వెలయు ప్రోడ
కపటవిద్వేష పరజన గర్హణాది
కలుషబహుదూరవర్తియై మెలగుసుకృతి
వత్సవయ జగ్గరాజేంద్రుని వరసుతుండు
గుణసముద్రుండు తిరుమల కొండరాజు.
గీ. పుణ్యుఁడగు తిరుమలకొండభూవరునకు
లక్ష్మమాంబకు గలిగిరి లలితమతులు
సుతులు వితరణగుణ వినిర్జితసురద్రు
లధిక ధైర్యాద్రులు నరేంద్రులమితరుచుల.
సీ. రతిరాజసుందరుం డతిశూరుఁడానత
క్షితిభర్త వెంకటపతి విభుండు
శ్రీజానకీనాథ పూజామహోత్సవ
భ్రాజమానుఁడు జగ్గరాజ వహ్ని

వైరిశైలబలారి వారిజాసనతుల్య
సూరిపోషకుఁడు కస్తూరి నృపతి
యింద్రవారణ శరచ్చంద్రికాసిత కీర్తి
పొందు శ్రీరామచంద్రనృపుఁడు
భద్రదాతృత్వవిజిత సముద్రదేవ
తాద్రుమ సుధాకరుఁడు బలభద్రశౌరి
యవని పాలించు విష్ణు పంచాయుధంబు
లనఁగ వెలసిరి వత్సవాయాన్వయమున.

క. అందగ్రజునకు శ్రీగో
విందకృపాపాత్రునకును వెంకటపతికిన్
నందనుఁడు తమ్మిరాజపు
రందరుఁ డుదయించె విబుధరక్షకుఁడగుచున్.

మ. మితభాషిత్వము ధైర్యసంపదయు గాంభీర్యంబు నౌదా[ర్యము న
జతురత్వంబును ధర్మశీలతయు సౌజన్యంబు జన్యక్షమా
గతమస్సాధ్యవిరోధిసంహరణజాగ్రత్ప్రౌఢవిక్రాంతియున్
మతివైశద్యముతమ్మిరాజమణికిన్ నైజంబులెల్లప్పుడున్.

సీ. క్రతువు సేయించె బాంధవాశ్రితులఁ బ్రోచె
మాన్యఫలములొసంగె బ్రాహ్మణుల కెల్ల
జగపతినృపాలకృప గాంచిజనులమనిచె
వత్సవయ తమ్మిరాజు పావనుఁడు భళిరె.

ఆతమ్మిరాజునకు వి
ఖ్యాతపతివ్రతకుఁ జంద్రమాంబకు భాగ్యో
పేతుఁడు వెంకటపతిధా
త్రీతలపతి సుతుఁడుపుట్టెఁ దేజంబెసఁగన్.

. శ్రీయుతుఁడై యారోగ్యచి
రాయుష్యల పుత్రశాలియై వితరణ రా
ధేయుఁడు వెంకటపతినర
నాయకుఁడభివృద్ధిజెందు నరహరికరుణన్.

గీ. దశరథసుతాగ్రగణ్యుఁడౌ దనుజవైరి
చందమున గోపినాథభూజానిసుతుల
కగ్రజుఁడునయిమహిమచేనమరుజగ్గ
రాజుసంతతి వర్ణింతురమ్యఫణితి.

గీ. చంద్రసముఁడైన జగ్గరాజేంద్రు సుతులు
కృష్ణనృపుఁడును గోపధాత్రీశ్వరుండు
జ్ఞాననిధి వెంకటపతియు సమరరంగ
వీరుఁడాచార్యరాజును వెలసిరందు.

సీ. తనఖడ్గఫణిరాజు దర్పాంధశాత్రవ
ప్రాణానిలాహారపరతఁ జెందఁ
దననామమంత్ర ముద్ధతవైరిభేతాళ
పతుల సాధ్వసపలాయితులఁ జేయఁ
దనభేరికా ధణంధణ నినాదంటు మ
త్తారిదంతులకు సింహారవముగఁ

దనపరితాపాగ్ని దుర్దాంతవిద్వేషిభూ
వరులకు శలభ భావముఘటింపఁ
రాయవేశ్యా భుజంగ సంగ్రామవిజయ
రాజమార్తాండ గడిదుర్గ రాయబిరుద
రాజితుఁడు వత్సవయ జగ్గరాజ సుతుఁడు
ప్రజలఁబాలించెఁ గృష్ణభూపాలమౌళి.

ఉ. కొండెములాలకింపఁడు ప్రకోపము సేయఁడు విప్రకోటిపై
బండితమిత్త్ర బంధుజన పక్షము మానఁడు యుద్ధకేళిలోఁ
జండవిరోధి యూధభుజశక్తి గణింపఁడు రాజలోకమా
ర్తాండుడువత్సవాయకులధన్యుఁడుకృష్ణనృపాలుడెన్నగాన్.

చ. నిటలతటాక్షిచేత మరునింబరిమార్చిన శూలహస్తుఁడున్
బటుగిరిభేదియౌ భిదురపాణియుఁదారకదానవుంబరి
స్ఫుటధృతిగెల్చినట్టిశిఖిసూతియుఁ గయ్యము సేయవచ్చినన్
గుటిలవిదారి జగ్గనృపుగోపనృపాలుని గెల్వనేర్తురే.

వ. అతని సోదరుండు.

ఉ. శ్రీపతిభక్తిచేతఁ గులశేఖరుడైన ఘనుండు చిత్తవి
క్షేపము లేనిబోధనుఁడు శ్రీకర దేశిక విష్ణుపాదసే
వాపరిశుద్ధవిగ్రహుఁడువైష్ణవలాంఛన పంచసంస్కృియో
ద్దీపితమూర్తి వెంకటపతిప్రభురత్నము ముక్తుఁడేకదా.

క. గంగాస్నాన పవిత్రుఁడు
సంగరవిజయుండు బంధుసమ్మతుఁడనఘుం

డంగజ గురుభక్తుఁడు స
త్సంగకుఁ డార్యరాజు సరసుఁడు భళిరే.

వ. అందు.

గీ. భాగ్యసిధియగు గోపభూపాలకునకు
సంభవించిరి నరసన్న జగ్గరాజు
గృష్ణఘనుఁడును వెంకటకృతివిభుండు
శాఁతులనుపుత్రులత్యంత సదయమతులు.

గీ. శరణుజొచ్చిన దీనులఁగరుణఁజూచి
దొరలఁ గావించుమహిమచే నరసరాజు
బంధుజనములయెడఁబక్షపాతియగుచుఁ
దగ్గులేకుండ బోషించె జగ్గరాజు.

మ. శరకోదండ భుశుండితోమర గదాచక్రాంకుశప్రాసము
ద్గరముఖ్యాయుధయుద్ధకౌశలకళాధౌరేయుఁడై క్రీడితో
సరిసేయందగుప్రోడయైనరపతి స్తవ్యప్రభావాఢ్యుఁడై
సరసుండై విహరించె వత్సవయకృష్ణక్షోణినాథుండిలన్

గీ. అతనితమ్ముఁడు శాంతుఁడత్యంతసుకృతి
బొంకుజంకుఁగళంకును బొందఁడెప్పుడు
వెంకటనృపాలుఁడధికుఁడై వెలసె నతని
సాటియగువారుగలరె యిజ్జగతియందు.

గీ. గోపరాజమహాళి కొమరులలోవంశ
కరుఁడుకృష్ణరాజుగనియె సుతులఁ

సూరిరరిపు విభాలుగోపనృపాలుని
రాజమాన్య సింగరాజ మణిని.

గీ. వత్సవాయ కృష్ణవసుమతీశ్వరు పెద్ద
కొమరుఁడైన యట్టిగోపరాజు
బుద్ధిమంతుఁడార్యపోషకుండు గృహస్థు
డనుచు జనులువొగడ ఘనతఁబూనె.

ఉత్సాహవృత్తము.

హృత్సరోరుహంబునందభీష్టదైవ మైన శ్రీ
వత్సలాంఛనున్భజించు వర్ణనీయశూరుఁడై
మత్సరింపుచున్నదుష్ట మతుల నిగ్రహించు శ్రీ
వత్సవాయ సింగరాజవర్యుఁ డార్యులెన్నఁగాన్

సీ. వైష్ణవాచార పావనునకు వెంకట
పతికిజనించె నూర్జితుఁడు సుతుఁడు
జగ్గరాజను రేంద్రసముఁడుభోగసమృద్ధి
బుద్ధుప్రసిద్ధు చేజోగిరాజు
హరికృపచేతనాధరణీశ్వరునకు వెం
కటపతి భూవరాగ్రణిజనించె
నాశ్రితజన వాంఛితార్థప్రదానసా
మగ్రివినిర్జితామరమహీంజ
దానవైభవుఁడైన యమాత్యవేంద్ర
పుంగవునకుఁ గుమారుఁడు పుట్టెజగ్గ

రాజు తమతాతపేరుచేఁ బ్రబలెనకల
భాగ్యసంపన్నుఁడై రాజయోగ్యుఁడగుచు.

వ. అనంతరంబ కృష్ణధరిత్రీకాంతుని సంతతి క్రమం బభివర్ణించెద.

గీ. వత్సవయ గోపినాథ భూవల్లభునకుఁ
బౌత్రమణియగుకృష్ణభూపాల మౌళి
కృష్ణదేవుండు భోజపుత్రిని వరించు
భాతి గుణవతి రంగమాంబను వరించె.

శా. ఆరంగమ్మకుఁగృష్ణభూపతికి విఖ్యాతప్రదాతృత్వమం
దారంబుల్ సుతులుద్భవించిరి జగన్నాథక్షమాభర్తయున్
ధీరోద్ధారుఁడు గోపరాజమణియున్ విస్ఫారగంభీరతా
క్షీరాంభోనిధియప్పలక్షితిపుఁడున్ శ్రీమత్ప్రభావోన్నతుల్.

వ. అందు.

మ. సమయంబించుక మించనీయక కిలఁబర్జన్యుండువర్షించె భూ
రమణీరత్నము సస్యసంపదలచే రాణించె వర్ణాశ్రమో
త్తమధర్మాన్వితులైరిలోకులు నితాంతంబుజ్జగన్నాథ భూ
రమణాగ్రేసరుఁడాదిరాజసముఁడై రాజ్యంబుఁ బాలింపఁగాన్.

ఉ. క్రోధము లోభమున్మదముఁ గ్రూరజనంబుల పాలుజేసి స
ద్బోధము సత్యమున్శమము భూతదయావినయార్జవంబులున్
మాధవపాద పంకజ సమంచితభక్తియు యుక్తియున్జగ
న్నాథనృపాలునందు నలినప్రభవుండుసృజించెనిమ్ముగన్

గీ. అమ్మహారాజు సోదరుండనఘమూర్తి
సత్యవాక్య హరిశ్చంద్ర చక్రవర్తి
భవ్యగుణశాలి గోపభూపాల మౌళి
ప్రజల రక్షించె నూర్జిత ప్రభ వహించె.

ఉ. అర్థులకున్ధనంబొసఁగు నప్పుడు కర్ణునిలీలఁ జూచుఁ బ్ర
త్యర్థుల సంహరించు సమయంబునఁ బార్థుని రీతిఁ బూనుస
త్యార్థయుతంబుగాఁ బలుకునయ్యెడ ధర్మజుభాతిఁ దాల్చు స
ర్వార్థవిదుండు గోపవసుధాధిపుఁ డద్భుతధాముఁ డెన్నఁగాన్.

ఉ. నారదురీతి శంతనునినందను కైవడి యంబరీషగో
త్రారమణేంద్రు పోలికఁ బురందరపుత్రుని భంగి మాధవ
స్మారపదారవిందయుగ సంతతభక్తిరసార్ద్రమానసాం
భోరుహుఁడై నగోపనృపపుంగవుఁ డెన్నఁ గృతార్థుఁడిమ్మహిన్

సీ. వల్మీక పర్వతేశ్వర రమానరసింహ
నిత్యోత్సవక్రియానిపుణభక్తి
బరవస్తు గోవింద భాగవతాచార్య
పరమపావన పాదపద్మసేవ
స్నానసంధ్యానమస్కారదివ్యాష్టాక్ష
రీమంత్రజపమహోద్దామనిష్ఠ
వాసుదేవానంత వరదనారాయణ
కృష్ణాది నామసత్కీర్తనంబు
భాగవత మాధవస్తోత్రపఠననియతి
మొదలుగాఁగల ధర్మసంపదల హెచ్చ

పుణ్య స్వరూపుఁడో కృష్ణనృపతి
పుఁడగు వత్సవయ గోపధరణివిభుఁడు.

డు రాయప్రభుని తిమ్మనృపేంద్రుఁడుధర్మరీతికిన్
విస్థితికిఁ గుణవిభూతికి ఖ్యాతికి సంతసించి స
పురస్సరంబుగ నితాంతమునన్నన చేసి మెచ్చఁగా
నమొందెనూరిజనగణ్యుఁడుగోపనృపాలుడెంతయున్.

౩. గోపనృపతి తమ్ముఁడు
నుశేంగుండు రాజపూజ్యుఁడు కరుణా
కరుఁడు మధురగానక
ంధర్వేంద్రు దప్పల ప్రభువమరున్.

నుబాహుఁ డజ్బాయతలోచనుం
డాకార కందర్పుఁడనఘమూర్తి
తసాహిత్య సరసవిద్యాశాలి
రణరంగ విజయుండు ప్రణుతకీర్తి
పాల పదభక్తి కుశలుండుసాహస
విక్రమార్కుఁడు సుకవిప్రియుండు
దహాసముఖారవిందుండు శరణాగ
త త్రాణనిపుణుండు ధార్మికుండు
జమాతృప్రండె ధనధాన్యరత్నవసన
ససంతోషితాశేషధరణిసురుఁడు
త్సవయ కృష్ణభూపాలవరసుతుండు
మ్యగుణహారి యప్పలరాజశౌరి.

వ. అప్పలరాజకుంజరునకుఁ గృష్ణభూపాలుడును రంగ నరపుంగవుండును, రాజగోపాలభూపతియును, సూరపరాజును బ్రభవించిరందు.

ఉ. వైష్ణవసత్కథాశ్రవణవర్ధిత పుణ్యవిశాలుఁడైన శ్రీ
కృష్ణనృపాలుకీర్తి శరహీరతుషారపటీర చంద్రికా
జిష్ణుమతంగజాశ్వశశిశేఖర లేఖమహీజరాజవ
ర్ధిష్ణురుచిప్రహారముల ధీగొని గెల్చి నిజాచ్ఛసుచ్ఛవిన్.

క. బంగారు కొండయైననొ
సంగును లోభంబులేక సత్కవులకహో
రంగద్వితరణ కర్ణుఁడు
రంగనృపాలుండు సుగుణ రత్నాబ్ధిగదా.

శా. చంచత్కీర్తిరమావిశాలుడుజయోచ్ఛ్రన్ రాజగోపాలుఁడ
భ్యంచచ్చంచలమండలాగ్రవిస్ఫూర్తిన్ జన్యంబులో వైరులన్
జించున్ ద్రుంచుంవధిచు నొంచుశిరముల్ భేదించుమర్దించుదూ
లించున్ ద్రుళ్లణగించుమించుగవిభాళించున్విచిత్రంబుగాన్.

గీ. కరుణయెక్కుడు సద్వివేకంబుఘనము
న్యాయమతి హెచ్చు శాంతిగుణంబు తెలుచు
చండవిక్రమవిభవంబు కొండపొడవు
రాజగోపాలధారుణీరమణమణికి.

క. సూరనృపాలుఁడు సురగిరి
ధీరుఁడగు శ్రీనారసింహ దేవునివలన

నాకారుణ్యమునకుఁ బాత్రిం
డై రాజత్కీర్తిశాలియై వర్తించెన్.

వ. ఇది యప్పలరాజు సంతానక్రమం బిటమీఁద సత
నికగ్రజుండును, బోషితాగ్రజుండునగు. శ్రీగోపభూపాలశ్రే
ష్ఠుని సంతతిప్రకారం బభివర్ణించెద.

గీ. వత్సవయకృష్ణధాగుణేశ్వరుని పుత్రిఁ
డైన శ్రీగోపాలనృపుని యర్ధాంగలక్ష్మి
యుభయకులకీర్తి సంధాయిశుభచరిత్రి
రమ్యగుణరత్ననికురుంబ రాజమాంబ.

ఉత్సాహవృత్తము.

భానుసముఁడు దంతులూరి పద్మనాభమౌళికిన్
దానధర్మ ముఖ్యగుణకదంబ లచ్చమాంబకున్
భూనుతైక పుణ్యమూర్తి పుత్రియై జనించె వ్యా
ద్యానవద్యకీర్తి రాజమాంబలక్ష్మికైనడిన్.

క. శాంతిమతి రాజమాంబా
కాంతామణి సాటివచ్చుఁ గంజాక్షుని సీ
మంతిని కజునింతికి దమ
యంతికి గంగాస్రవంతి కతిశయమహిమన్.

శా. ఆరాజమ్మకు గోపభూపతికి ఖడ్గాటోపనిర్వాపిత
క్రూరారివ్రతతుల్ జనించిరిసుతుల్ గోపాలకృష్ణప్రభుం

డాయాఢస్ఫుటకీర్తివైభవుఁడుసింహాద్రిక్ష్మాభర్తయున్
శ్రీరామారమణీయమూర్తులుబుధక్షేమంకరప్రాభవుల్.

వ. అందు.

సీ. తనమనోహరమూర్తి తనవినిర్మలకీర్తి
మకరాంకహరిణాంకమహిమఁ గెలువ
దనరసోక్తిసమృద్ధితనసూక్ష్మతరబుద్ధి
భోగీశవాగీశభూతిదెగడ
దనవిత్తవిశ్రీమవ్యక్తి తనధీరతాశక్తి
హరిరాజగిరిరాజగరిమ మాన్పఁ
దనవిఖ్యాతితనమహాద్యుతిరీతి
ధననాథదినరాధఘనత మీఱఁ
గల్పతరుకామధుగ్ఘనకలశజలధి
కర్ణఘనఘనవితరణగణ్యుఁడగుచుఁ
బ్రబలె శ్రీవత్సవాయ గోపరాజసుతుఁడు
జిష్ణువిభవుండు గోపాలకృష్ణవిభుఁడు.

మ. గుణరత్నాకరువత్సవాయకులజుఁ గోపాలకృష్ణప్రభున్
రణసన్నద్ధసముద్ధతాహితచమూనాథావరోధాంగనా
మణితాటంకభయంకరస్ఫురణశుంభద్రమాకౌక్షేయకున్
ప్రణుతింతున్నరదభ్రిశుభ్రకరభ్రాజద్యశోభిభ్రమున్.

మ. అతిధైర్యాన్వితచిత్తుఁడై వివిధవిద్యానాట్యరంగస్థలా
[illegible]ంచలుఁడై కృపాజలధియై యెంబుందుప్రసన్నాస్యుఁడై

కృతపార్థప్రతిభన్ బ్రతాపనిధియై గోపాలకృష్ణుఁడు మా
పతికంఠీరవుఁడాదరించి ప్రజలన్పాలించె ధర్మస్థితిన్.

సీ. తనునాశ్రయించిన ధరణీపరుల
కభిమతార్థములిచ్చి యాదరించుఁ
దనగృహంబునకువచ్చిన బాంధవులను స
త్కారంబుగానించిగారవించుఁ
దనపద్యములుపఠించిన వంధిమాగధ
జనులకుఁ గోరినధనమునొసఁగుఁ
దనతో నెదిర్చిన ధారుణీనాథుల
ప్రాణముల్ ఖడ్గంబు పాలుసేయు
దనమనఃపద్మమిందిరాధవమిళింద
విహరణస్థానమొనరించు విభవమమర
నెంతగుణవంతుఁడనిబుధు లెన్నఁబ్రబలె
జిష్ణువిభవుండు గోపాలకృష్ణవిభుఁడు.

క. గోపాలకృష్ణనామక
భూపాగ్రణిసోదరుండు పొగడికఁగాంచెన్
శ్రీపూర్ణుఁడు సింహాద్రిమ
హీపతిసత్యాభిరతుఁడు కృష్ణుఁడనంగన్.

సీ. నిజవంశదుగ్ధాంబునిధికి వృద్ధిఘటించి
బంధుచకోరపాళిఁబ్రోచి
యాశ్రితకైరవవ్రజంబుగావించి
దుష్టమానవతమస్తోమ మడఁచి

విమతపంకజవికాసము డిందుగాఁజేసి
నతజనదైన్యసంతాపముడిపి
సకలజనానురంజనము సంపాదించి
యతులితసుప్రసన్నతవహించి
దిక్తటంబులఁ గీర్తిచంద్రికలు నెరపి
ప్రతిభఁ గాంచె సింహాద్రిరాజచంద్రుఁ
డక్షయఖ్యాతిగుణరీతి నతిశయించె
నిష్కళంక స్వరూపతనివ్వటిల్ల.

మ. శ్రితభూదేవవనీవసంతునకు నారీరత్ననేత్రప్రియా
ద్భుతసౌందర్యకళావసంతునకు సంపూర్ణప్రతాపార్క మ
ర్దితవిద్వేషిమందాంధకారతతికిన్ శ్రీరమ్యసింహాద్రిభూ
పతికిన్ శూరతచేతసాటిగలరె భావింపభూమండలిన్.

శా. భూమిశస్తుతశౌర్యధైర్యసుషమాభోగంబులందున్ గుహా
సీమావాసపవిత్రతక్షయమునిస్త్రీయోగముల్ మానినన్
క్షేమంబొప్పఁగ సాటిసేయఁదగునీసింహాద్రిరాజేంద్రులన్
శ్రీమద్వత్సవయాన్వయోత్తమునితో సింహాద్రిరాజేంద్రుతోన్.

సీ. శ్రీధనంజయగోత్రపాథోధిరాకా సు
ధాకరుండా శ్రితశ్రీకరుఁడు
రణరంగసంగతారాతిజీమూతప్ర
భంజనుండు జనానురంజనుండు
న్నృగభగీరథరంతిసగరశంతనుసమ
ప్రాభవుండు సురేంద్రవైభవుండు

ధీరతామహిమావధీరితస్వర్ణాద్రి
మందరుండు మనోజసుందరుండు
దంతులూరి జగన్నాథధరణివిభుఁడు
తండ్రిగా లచ్చమాంబిక తల్లిగాఁగ
సంభవించెను సద్గుణజన్మభూమి
జానకీదేవిశ్రీదేవి సాటియగుచు.

గీ. అట్టిశ్రీజానకీదేవి నధికసాధ్వి
బరిణయంబయ్యె సింహాద్రిధరణిభర్త
మాధవస్వామి జగదేకమాన్యమైన
యంబునిధికన్య నుద్వాహమైనరీతి.

సీ. పరమపాతివ్రత్య భవ్యచరిత్రచే
ననసూయకైనవచ్చుననఁగవచ్చు
సజ్జనస్తవనీయసౌభాగ్యమహిమచే
నద్రికన్యకుసాటి యనఁగవచ్చు
ఘనదయాదాక్షిణ్యగౌరవయుక్తిచే
నలసుమిత్రకుసాటియనఁగవచ్చు
సంపూర్ణసుస్థిరసంపత్సమృద్ధిచే
నాదిలక్ష్మికిసాటి యనఁగవచ్చు
ననుచుఁదనయందుఁగల్గుగుణాతిశయము
బాంధవులుమెచ్చి పొగడంగఁ బ్రభవహించె
వత్సవాయ సింహాద్రిభూవరునిరాణి
జానకీదేవి ధర్మవాసనలతీవి.

మ. క్షితి దేవీసదృశక్షమాసతియగు శ్రీజానకీసాధ్వికిన్
శ్రితసంరక్షణదక్షదాననిధికిన్ సింహాద్రిభూభర్తకున్
మతిమంతుల్సుతులుద్భవించిరిజగన్మాన్యుండుగోపక్షమా
పతిసుత్రాముఁడుపుణ్యశాలిచినగోపక్షోణిభృన్మౌళియున్.
మ. చినగోపక్షితిపాలశేఖరుఁడుసౌశీల్యంబునన్బద్ధుఁడై
జననంబాదిగఁ బ్రిత్యహంబునుకృతాంచద్వృత్తి మూర్జింపుచున్
దనుజారాతిపదాంబుజంబులను సంధానంబుగావింపుచున్
జననేత్రప్రియుఁడర్మునండగుచుశశ్వత్కీర్తిగాంచెన్భువిన్.
క. చినగోపనృపునిదర్శిం
చినమానవులెల్లపూర్ణశీతాంశునిజూ
చినచందంబునఁగడు హె
చ్చినసంతోషాతిశయముఁజెందుదు రెలమిన్.
గీ. వత్సవయగోపధారుణీశ్వరునిపుత్రుఁ
డైనసింహాద్రినృపునిభాగ్యంబువలన
విష్ణుదేవాంశమసంభవించినట్టి
గోపవిభునినుతింతువాగ్గుంభతతుల.
శా. శాంతస్వాంతు దిగంతదంతిరదభాస్వత్కీర్తి విద్వేషితా
శాంతున్మిత్రవనీవసంతురణరంగాత్యంతవిక్రాంతువి
భ్రాంతారాతితమఃప్రమాపణకనద్భానంతు గోపక్షమా
కాంతున్వత్సవయాన్వయాబ్ధిరజనీకాంతున్నుతింతున్ధృతిన్
శా. క్షీరాబ్ధిన్విలసిల్లుచందమున లక్ష్మీదేవి చన్దోయిపై
[illegible]హారించురీతి రవిబింబాంతస్థితుం డైన య

ట్లా రాజీవవిలోచనుఁడు సతతోద్యల్లీలఁ గ్రీడించు న
శ్రీరమ్యంబగు గోపభూవరుమహాచిత్తారవిందంబునన్

చ. చదివిన బ్రహ్మచారులకు సత్కులసంభవులైనవారికిన్
హృదయము సంతసిల్లఁగ ననేకులకున్బహువిత్తమిచ్చి స
ద్వ్రతముగా వివాహములు విప్రజనప్రియుఁడాచరింపుచున్
సదయుఁడుకీర్తిఁగాంచెనృపచంద్రుఁడుగోపనృపాలుఁడున్నతిన్.

సీ. శ్రీమహావరవస్తు రామానుజాచార్య
గురుభక్తినిపుణుఁడే ధరణివిభుఁడు
బహుపురాణశ్రేష్ఠ భాగవతగ్రంథ
పరమార్థవేది యే భాగ్యశాలి
ప్రతివాసరాగత బ్రహ్మవిద్వజ్జనా
భిమతప్రదాత యే విమలకీర్తి
కమనీయ గుణభవ్య కావ్యనాటకపరి
జ్ఞానప్రవీణుఁడే దానఘనుఁడు
శ్రీరామకృష్ణదేవపాదారవింద
సంతతధ్యానరససుధాస్వాదమోద
మానమానసుడధిరాజమాన్యుడతఁడు
రాజమాత్రుడె శ్రీగోపరాజ మౌళి.

సీ. తనమహౌదార్యంబు తనమహాధైర్యంబు
కరణి జీమూతరాఘవ మొనర్ప
దనవినిర్మల కీర్తి తనవిక్రమస్ఫూర్తి
పగిది బద్మాహితో పమహసింప

దనుష్షువిద్యాభూతి తనరూపవిఖ్యాతి
గతిఁ గమలోద్భవగరిమమీఱఁ
దనకార్ముకప్రౌఢి తనప్రతాపనిరూఢి
భాతిధనంజయు ప్రథిమఁబూన
ధరణినుతి కెక్కి నిజభుజాదండమండ
లాగ్రదర్శనచకితమత్తారినృపుఁడు
వత్సవాయ సింహాద్రి భూవర సుతుండు
ప్రణుత గుణశాలి గోపభూపాలమౌళి

సీ. శారద నీరద నారద పారద
హారదర స్ఫూర్తి నవఘళించి
శరదిందు శరకుంద శరబృందవర చంద
న హరిచందన కాంతిలహరిమీఱి
హరికాంత హరికుంత హరిదంత కరిదంత
విధుకాంత పృథుకాంత విభవహసించి
పురవైరి ధరశీర్షగిరి దారివారి శౌరి
చరణ నిర్ఝరవారి సుఱచిఁగేరి
పాండు రాఖండ నిజకీర్తి మండలంబు
పుండరీకభవాండంబు నిండ మెఱయఁ
బ్రభవముగాంచె సింహాద్రి రాజసుతుఁడు
ప్రణుత గుణశాలి గోపభూపాలమౌళి.

సీ. ప్రతివత్సరంబు గోపాల దేవునకుఁగ
ళ్యాణంబు గావించు రాణమీఱ

ధరణిసురులకు భూదానంబు లొనరించుఁ
బ్రాచీన మాన్య భూఫలములిచ్చు
నధ్యాపకులఁదెచ్చి యనిశంబువటువుల
వేదవిద్యాభ్యాస విదులజేయు
నాఁగొనివచ్చిన యభ్యాగతుల కెల్ల
నిష్టమృష్టాన్నంబు లెపుడు నొసఁగు
నెంత పుణ్యాత్ముఁడనిలోకు లెన్నుకొనఁగఁ
గీ. సుకృతాతిశయములవార్త కెక్కె
వత్సవాయ సింహాద్రిభూవరుని సుతుఁడు
ప్రణుత గుణశాలి శ్రీగోపరాజమౌళి.

మ. వరతుల్యాఖ్యమహానదీతటమునన్ వల్మీకశైలంబునన్
నరసింహప్రభుమందిరంబుపరసన్ నానాఫలక్ష్మారుహో
త్కరరమ్యంబగు నారికేళవనమున్గల్పించె దైత్యారికిన్
సిరివర్ధిల్లఁ బుష్పవాటిరచియించెన్గోపపరాజెన్నఁగన్.

మ. వరకాంచ్రేగులపట్టణంబుసరసన్ వర్ణింపఁగా యోగ్యమై
పరమస్వచ్ఛజల ప్రపూరనిధియై పాంథప్రియోత్పాదియౌ
చెరువున్బావియు మావితోఁపునుప్రతిష్ఠించెన్మహాధర్మత
త్పరశీలుండగుగోపభూరమణుఁడే తన్మాత్రుడే యెన్నఁగన్.

క. శ్రీనుతకీర్తివైభవ విశిష్ట దుహితవరవస్తు వఁశరా
మానుజదేశికేంద్ర కరుణాంజనసాధిత భావ

మానుజసౌగిరాణ్మతరమాస్యనిధిన్వినుతింతుకృష్ణసే
వానిరతాత్మ వత్సవయవంశ వివర్ధను గోపభూవరున్.

చ. వరచతురంతయాన గజ వాజి శతాంగములాతపత్రచా
మరమణి కేతనోత్సవ సమంచిత కాంచరత్నభూషణాం
బరములు భోగభాగ్యమహిమంబులు గోపనృపాలమాళిచే
సిరియునుబుట్టకొండనరసింహులకున్దొరకున్నహోన్నతిన్.

గీ. వార్తకెక్కిన శ్రీవత్సవాయ గోప
రాజశేఖరునకుఁ గూర్మిరాణియగుచు
నంస్తుతివహించె దాట్ల భాస్కరునిపుత్రి
ఖ్యాత గుణరత్న నికురుంబ సీతమాంబ.

గీ. శ్రీకరలసద్గుణాలంబ సీతమాంబ
సాటియగు చారుసౌభాగ్య సద్గుణముల
హైమవతికి నరుంధతి కజునిసతికి
శౌరియువతికి జగతికిఁ జంద్రమతికి.

శా. సీతాసాధ్వియు గోపభూవతియు లక్ష్మీకృష్ణదేవాంఘ్రికం
జాతారాధన పుణ్యలబ్ధగుణభాస్వత్పుత్రపౌత్రాఢ్యులై
ఖ్యాతైశ్వర్యచిరాయురభ్యుదయసౌభాగ్యారోగ్యసంపన్నులై
యాతారార్కసమృద్ధిగాంతురుప్రజల్ హాళిం బ్రశంసింపగన్.

చ. గురుతకీర్తి వత్సవయ గోపనృపాలుఁడు రాజమాన్యుఁడై
[illegible]చిరాయురభ్యుదయ శాశ్వతపుత్రసమృద్ధిశాలియై

ద్విరదరథాశ్వరాజ్యబహువిత్తసమన్వితుఁడై కృతార్థుఁడై
వరవిజయాఢ్యుఁడై సిరుల వర్ధిలుగావుత శౌరిసత్కృపన్.

— షష్ఠ్యంతములు —

క. ఏతాదృశగుణరత్న
వ్రాతసరస్వతికి దానవైభవజితజీ
మూతరవి సూతసురభూ
జాతాద్భుతవితరణాతిశయవిశ్రుతికిన్.

క. చండాహితకాండతమః
ఖండనమార్తాండునకు జగత్పూర్ణయశో
మండల జితపాండురకర
కుండలిరాట్కనకధర కోదండునకున్.

క. సంకులవిమతనృపాంతక
హుంకృతి శంకాకరాహవోద్భటభేరీ
భాంకృతికి బిరుద రాజభ
యంకర వరబిరుదనిరుప మాలంకృతికిన్.

క. అంగాంధ్ర చోళమాళవ
బంగాళ కళింగవంగ పాంచాలసభా
రంగపటునటనకేళీ
రంగతసత్కీర్తి నర్తకికి జయధూర్జటికిన్.

క. శ్రీవత్సవాయ వంశసు
ధావారిధిసోమునకు బుధస్తుతచాప

ప్రావీణ్యారామునకు సం
భావితదోర్దండ చండబలభీమునకున్

క. వనజాక్షునకును స
జ్జనరక్షణ దక్షునకుద్వివ తుక్కంజరభం
జనవిక్రమహార్యక్షున
కనుపమపరభోగనిర్జరాధ్యక్షునకున్.

క. ప్రణుత ప్రతాపతరణికి
రణగర్వితవిమతభూవర ద్విరదమహా
సృణికిన్ జగదద్భుతవిత
రణచింతామణికి గోపరాజాగ్రణికిన్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధి యగునట్లుగా నారచియింపబూనిన రామవిలాసంబను ప్రబంధమునకుఁ గథాప్రారంభంబెట్టిదనిన.